# షరా మామూలే

(కవితా సంపుటి)

డా. కొలకలూరి ఇనాక్

జ్యోతి గ్రంథమాల

తపోవనం అనంతపురం

# విషయసూచిక

మధుర హృదయులు

మాన్యమహోదయులు

డా. బెజవాడ గోపాలరెడ్డి గారికి

అంకితం

వెన్న వెన్నెల కలిపితే మీ హృదయం
వెలుతురు వెల్లువ మథనం మీ జీవితం.

సాహితీ రాజకీయ రసప్రాంగణ సార్వభౌములు మీరు
సరస సహృదయ కవీశ్వర హృదయవేదులు మీరు.

మీ వాక్కులో తీపితీపి తేటతెలుగు
మీ మాటలో అమృతార్ద్రహృది వెలుగు.

మీ మూర్తిలో ఆంధ్రతా జవజీవాలు
మీలో ఉజ్జ్వలించే రససౌందర్యాలు

మీ సన్నిధి ఒక పెన్నిధి
మీ మౌనం రసోల్లోల కల్లోలిని.

ప్రోత్సహించటం మీ జీవిత ధర్మం
ఆదరించటం మీ నిత్యకృత్యం.

మీ ఆశ్రయం పొందినవాళ్ళు
ఎందరో కవిపండితులు
మీ ఆత్మీయత అందినవాళ్ళు
ఎందరో హృదయార్థులు
రసార్తులు.

కవితకు మా జీవితం వ్యాఖ్యానం
వాత్సల్యానికి మీ వ్యక్తిత్వం ప్రతిబింబం
మిమ్మల్ని చూస్తుంటే నాకు కనిపిస్తాయి
ఉదయోజ్జ్వల సూర్యతేజం
అరుణారుణ రవికిరణం.

ఎందరెందరో కాంతిజీవులు
శాంతి జీవులు
మీ అనురాగాదరణలకు వారసులు.

ఆర్తి గుర్తించి ఆదరించేహృదయం మీది
అనురాగంతో ఆశీర్వదించేవ్యక్తిత్వం మీది.

ఈ కావ్యం నా హృదయం
మీ కంకితం.

# కృతజ్ఞత

నా కవితలను ప్రచురించి ఆశీర్వదించిన భారతి స్రవంతి ఆంధ్రపత్రిక ఆంధ్రప్రభ ఆంధ్రభూమి విశాలాంధ్ర మొదలైన పత్రికాధిపతులకూ, సంపాదకులకూ;

కవి సమ్మేళనాలతో పాటు అనేక కార్యక్రమాలలో ప్రసారం చేసి ప్రోత్సహించిన ఆకాశవాణి హైద్రాబాదు విజయవాడ కడప మద్రాసు అధికారులకూ;

కవి సమ్మేళనాలలో అవకాశం కల్పించి ఆదరించి కవితా పఠనం చేయించి సన్మానించిన ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వానికీ, కళాసాహితీ సాంస్కృతిక సమాజాలకూ, కళాశాల గ్రంథాలయ సంస్థల అధికారులకూ ;

కావ్య ప్రచురణార్థం ఆర్థిక సహాయం చేసిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకీ ;

మూడురోజుల్లో ఇంత ముచ్చటగా ముద్రించిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ వాళ్ళకీ ;

ఈ పదిహేనేళ్ళ కవిత్వంలో కొంత ఈ కావ్యంలో చోటు చేసుకొన్నా, పాఠకేళ్ళుగా నా కవిత్వం చదివి చదివించి విని ఆశీర్వదించి అభిమానించి ప్రోత్సహించిన గురుదేవులకూ, మిత్రులకూ, బంధువులకూ, సహృదయులకూ, అందరికీ;

కృతజ్ఞుణ్ణి.

# షరా మామూలే

నాటక ప్రదర్శన కరపత్రంలో హెచ్చరిక:
షరా: సమయానుకూలముగా రేట్లు హెచ్చింపబడును.
ఏకారణము చేతనైన నాటకము ఆడనిచో ఆగినచో
టిక్కెట్టు డబ్బు వాపసు ఇవ్వబడదు
అదేటిక్కెట్టుపై పొరుగూరులో నాటకము చూపబడును.
వన్సుమోరులు అల్లరి ఈలలు లేవు.

అయితే సాధారణంగా రేట్లు పెంచరు
నాటకం ఆగదు, పొరుగూరులో చూపరు
వన్సుమోరులు అల్లరి ఈలలు మామూలే
ఇంతా రాయకుండా అంతా ఉద్దేశించి షరతులు కుదించి
షరా: మామూలే అని షరామామూలే అని రాస్తారు
(నాటకానికీ జీవితానికీ సంబంధం ఉంది)
షరతులూ మామూలే-వాటి సతాయింపులూ మామూలే
షరా మామూలే-ఇదీ టిక్కెట్టు డ్రామా

*

ఇక జీవిత నాటకం
ప్రాచీన భారతీయ వాఙ్మయంలో సందేశం:
దేవుడు సృష్టికర్త
రక్షణ శిక్షణ భగవంతుడి విధులు
చాతుర్వర్ణ్యం వ్యవస్థాధర్మం
ఆశ్రమవిధానం జీవితం
సత్పురుషుడికి స్వర్గం
దుష్టుడికి నరకం.

అయితే దేవుడి ఆచూకీ లేదు.
రక్షణ శిక్షణ మనిషి పనులు
చాతుర్వర్ణ్యం శిథిలమయింది

ఆశ్రమధర్మం నాశనమయింది.
భక్తి వృత్తి భజన ఆకలి
స్వర్గనరకాలకు భూమే కూడలి.
అలా ఉండటమూ మామూలే-ఇలా కావటమూ మామూలే
షరా మామూలే - ఇదీ వ్యవస్థాజీవితం.

*

ఇంకా జీవిత నాటకం
దేశ జీవిత పరిణామ స్వరూపం:
దేవుళ్ళ రాజ్యనీతి పోయింది.
మునుల ఆవుల గోత్రాల కాలం చెల్లింది.
రాజుల యుద్ధాల దోపిళ్ళ సామ్రాజ్యం గతించింది
జమీందార్ల కక్కుర్తి కూటి పాటు తప్పింది
ప్రజా ప్రభుత్వం అవతరించింది.
ఫలస్వామ్యం పోయి, గోస్వామ్యం ముగిసి
భూస్వామ్యం తగ్గి, ధనస్వామ్యం పెరిగి
దేశ సంపదంతా సమంగా పంపకం అవుతూవుంది.

అయితే ప్రజా ప్రభుత్వంలోనూ
జమీందార్లు రాజులు మునులు దేవుళ్ళు
సింహాసనాలెక్కి రాజ్యాలు పాలిస్తున్నారు.
దేశంలోని స్థిరచరాస్తులు కొందరే పంచుకొంటున్నారు.
దేశ పరిణామమూ మామూలే-సంపద పంచుకోవటమూ
మామూలే
షరా మామూలే - ఇదీ దేశ జీవితం.

*

ఈ కవిత్వంలోని జీవితం:
దేశం బాగుపడాలనీ, పాడు కారాదనీ,
కులంబాధా ధనంహింసా తొలగాలనీ,
భూమి మిగతా భూతాల్లా అందరిదనీ,
పీడన ఏరూపంలోనూ ఉండరాదనీ,
శ్రమఫలం సమైక్యం సిద్ధించాలనీ,
హరిజనులు ఆడవాళ్ళు ఇబ్బందిపడరాదనీ,

ప్రేమా విలువలూ గుర్తింపు పొందాలనీ,
మనిషి ప్రకృతి పరాభవానికి గురికారాదనీ,
సమాజం సామూహిక సత్యమనీ, గుర్తించింది.
బాధతో వేదనతో దుఃఖంతో కుమిలింది.
ఎక్కడెక్కడో కరుణాధిక్షేపంగా ఘోషించింది.
వ్యవస్థ వ్యక్తిగా, సమష్టి వ్యష్టిగా, లోకం 'నేను' గా
రోదించింది.

ఆందోళన సమాజ హృదయధ్వనే కానీ
అరక్షిత అలక్షిత అశిక్షిత అశక్త ప్రోత్సాహిత
ఆందోళన గుండె చప్పుడు కాదు నొప్పిఅనీ,
సృష్టి నుంచి శవ సంస్కారందాకా
లోకం వలలో గిలగిలలాడిన చేప గుండెకాయ.
అది లేకపోయినా ప్రేమించటం జీవిత సత్యం అనీ,
జనం పెరగటమంటే సమస్యం సంకెళ్ళ పడటం అనీ,
గమనించింది

పల్లెను చూస్తే ప్రగతి కనిపించినా
ఇల్లు అనుకొంటే సంక్రాంతి గుర్తొచ్చినా
దేశంలో మార్పు మనిషి చైతన్యమార్గంగా అనిపించినా
అవి నిజం కావాలనే ఆశాసుమాలుగా ఆఘ్రాణించింది.

అయితే దేశభవితవ్యం సందేహసంకులంగా
కులం విశృంఖల విహారంగా
ధనం విశ్వ విరాట్స్వరూపంగా
పీడన విచిత్తల విస్తృతంగా
సమాజం అధోముఖంగా తిరోగమనంగా
మనిషి బలహీనుడుగా పిరికివాడుగా

మానవత దీనాతిదీనంగా దయనీయంగా
స్వేచ్ఛ గగనకుసుమపరీమళంగా
స్వాతంత్ర్యం కారాగారంలో నూనెలేని కాగడాగా
అభ్యుదయం నగరంలోని అంధకారంగా
సమైక్యత బలహీనుల బ్రతుకు తాపత్రయంగా
సమాజం ధనవంతుల తోలుబొమ్మల వినోదంగా
జీవితం జూదంగా జాదూగా మట్కాగా
బ్రాకెట్‌గా రేస్‌గా సజీవదహనంగా అవటం

వ్యవస్థ గుడి గోడలు చీలటం
విలువల సిమెంటు డాములు పేలటం
సంస్కృతి శిఖరాలు గోపురాలు కూలటం
భూగోళానికి కన్నంపడి ఘనంద్రవమై కారటం
గుండెలు ఎండి మండి నుసై మసై జారటం
పాతాళం ఈపాడు బురదతో పరాభవం పొందటం
ఈ దేశంలో దినచర్య క్షణచర్య.
కవితా ప్రయత్నమూ మామూలే-సామాజిక జీవితమూ
మామూలే
షరా మామూలే — ఇదీ కవిత్వం.

*

'షరా' మామూలేసమాజంలోని నాటక జీవితానికీ,
స్తబ్ధతకూ అశక్తతకూ,
అలసతకు బలహీనతకూ,
వికారాలకు వైరుధ్యాలకూ, ప్రతీక.
ఆధునికజీవితం వేసుకొన్న ముసుక్కి-
ధాని మూర్తికీ ప్రతిబింబం.

అయితే సమాజ జీవితంలో చైతన్యం శక్తి పుట్టి
ఉత్సాహం ఉత్తేజం కలిగి
సౌందర్యం సౌజన్యం లభించి
సౌహార్దం సౌభ్రాతృత్వం పెరిగి
దేశం వెలుగుతుంది కవి ఎత్తిన కేతనంలా
కళ నిలిపిన నికేతనంలా.
నిత్యంగా కవితా బాధా మామూలే
సత్యంగా కవితానందమూ మామూలే
షరా మామూలే
ఇదీ షరా మామూలే!

# మన దేశమా?!

మనకేం ?
మనం బాగున్నాం !
మన దేశమా ?!
ఇది మరీ బాగుంది !

సిమెంటు కంట్రోలురేటు
పది నుంచి ఇరవైకి పెరిగిందని
బాధ పడ్డాడొక కంట్రాక్టరు.

సిమెంటు బ్లాకుమార్కెట్టురేటు
ఇరవై నుంచి నలభై అయిందని
విలపించాడొక గృహస్థు.

పడిన గోడ నిలబెట్టటానికి
బండిమట్టి పదిరూపాయలని
కుమిలి పోయాడొక సామాన్యుడు.

'సిమెంటు అంటే ఏంటి ?
మట్టెందుకు ?
తాటాకురేటు పెరిగింది !'
అంటున్నాడొక పూరిగుడిసె సొంతదారు.

'గుడిసెతో ఏం పని'
అన్నాడొక చెట్టు నివాసి.

'చెట్టా ?'
అన్నాడొక దేశదిమ్మరి.

మనకేం ?
మనం బాగున్నాం !

# 2

మన దేశమా ? !
ఇది మరీ బాగుంది !

*

బిడ్డ పాలకోసం కొన్న ఆవుకు
గడ్డి దొరకక్క
అల్లాడిందొక ఇల్లాలు.

పాల డబ్బా
ఖరీదు పెరిగిందనీ
కల్తీ అయిందనీ
విలపించిందొక కులసతి.

పాలవాడు
పిల్లకు కొన్న పాలలోనూ
ఏ పంపు నీళ్ళో కలిపేడని
ఏడ్చిందొక ఇంతి.

కన్నబిడ్డకు
కడుపారా ఇద్దామంటే
పాలుపడక పాలురాక పాలులేక పాలుపోక
విలవిల్లాడిందొక ఎండుడొక్కల కూలితల్లి.

రోడ్డుపక్క ముళ్ళపొదలో
తల్లెవరో తెలియక
ఏం కావాలో తెలియక
లోకం తల్లికోసం
చేతులెత్తి అరుస్తూవుంది
అప్పుడే పుట్టిన పసినెత్తురుముద్ద.

మనకేం ?
మనం బాగున్నాం !

# 3

మన దేశమా ?!
ఇది మరీ బాగుంది !

*

కారు పోతుంటే
కుదుపు వస్తుందని
కొత్తకారు కొన్నాడొకడు.
కారు కుషన్ సీటు
వత్తుకుంటూ ఉందని
ఫోందిళ్ళు చుట్టూ
పేర్చుకొన్నాడింకొకడు.

వెస్పా కొందామని
హంబరు కూడా కొనలేక
తెగిన చెప్పు కుట్టించుకొన్నాడు వీడు.

చెప్పుల్లేక
కాళ్ళీడ్చుకొంటూ
వీధులూడుస్తున్నాడు వాడు.

రెండు కాళ్ళూ లేక
వళ్ళంతా కాళ్ళే అయి
వీధంతా తిరిగి
అడుక్కొంటున్నాడు మరొకడు.

మనకేం ?
మనం బాగున్నాం !
మన దేశమా ?!
ఇది మరీ బాగుంది !

*

సమస్యలుంది
ఒకరికా ఇద్దరికా
అందరికీ !

## 4

ఈ సమస్యలు
ఒకటా రెండా ?
అనేకం.

ఈ దేశం
చిన్నదా చితకదా
విశాలం.

లోకమంతా ప్రేమై
హృదయమంతా దయై
ఉంటే తప్ప
ఈ జీవితాలకు మోక్షం లేదు.

మనకేం ?
మనం బాగున్నాం !
మన దేశమా ? !

.............

# ఏమయ్యేట్టు?

నాకు తెలుసు
మీకు లోకమంటే సౌజన్యం
దేశమంటే సౌభాగ్యం
కానీ మీకు తెలుసు
నాకు లోకమంటే ఆకలి
దేశమంటే కేక

పలకా బలపాలకు తిలకందిద్దేవాళ్ళే కాదు
బర్రెతోక మెలేసి చెవి నులిమించుకునేవాళ్ళు
నేలకు మొలకనవ్వు తెలిపి దుమ్ముకొట్టుకుపోయేవాళ్ళు
ఫేక్టరీ గొట్టపొగ ఊపిరిగా పీల్చేవాళ్ళు
వెన్నెముక నిచ్చెనమీద బస్సుబరువు దించేవాళ్ళు
పేక బీడీ బ్రాందీ త్రివేణీ సంగమంలో ముంచేవాళ్ళు
బ్లేడుతో జేబులు చేతులు మెడలు గీసేవాళ్ళు
బాలలనీ, భావి భారత పౌరులనీ,
గత భారతి వారసులనీ, తెలిసి తెలిసి తెలిసి
మనం ఏం చేసేట్టు?
దేశం ఏమయ్యేట్టు?

పసివాళ్ళ పొట్టలు ఊదిన బెలూన్లు
కాళ్ళు గోగుపుల్లలు
చేతులు లయతప్పిన పట్టుకార్లు
కళ్ళనీళ్ళ గోళీలు
అన్నీ కలిసి శరీరం చుట్టుకొని
ఊపిరున్న శవాలుగా

# 6

ప్రపంచ వీధుల్లోంచి దండయాత్ర చేస్తే
కళ్ళజోళ్ళతో కథాకళి చూస్తూ
భరతనాట్యం చేస్తూ, పురాణాలు వల్లిస్తూ
మతి చలిస్తూ జనం జీవిస్తుంటే
మనం ఏం చేసేట్టు?
దేశం ఏమయ్యేట్టు?

ఆకలిగాలివానలు అనారోగ్యం తుఫానులు
దారిద్ర్యం దుర్దినాలు అశక్తత ముసురులు
పట్టిన పసివాళ్ళు నిరంతర పరాభవానికి గురౌతుంటే
కళ్ళలో నీళ్ళు చెవిలో దూది పెట్టుకొన్న జనం
కాలక్షేపం కబుర్లు బతానీలుగా కొరుక్కుతింటూ
సానుభూతి సంతాపాల చుట్టలు కాల్చుకొంటూ
వేసినచోటే ఉన్న గొంగళి కప్పుకొని
ఉన్నచోట ఉండలేని ఊపిరి వదిలేసి
భవిష్యత్తును నుసిమసీ చేస్తూ
వర్తమానాన్ని విధికీ వధకూ వదిలేస్తుంటే
మనం ఏం చేసేట్టు ?
దేశం ఏమయ్యేట్టు ?

తల్లి పాలబలమూ, కళ్ళకలిమీ
చేతులచెలిమీ, ఆలింగనసుఖమూ
తెలియని పసివాళ్ళు నిర్భాగ్యులై
అన్నలక్కల అలక్ష్యానికి గుర్తులై
ఆటపాటలు లేని మౌనులై
తండ్రి దండనకు రోగులై
సంఘం తృణీకరిస్తే పోగైన గడ్డికుప్పలై
అగ్గిపడి భగ్గున మండబోతుంటే
మనం ఏం చేసేట్టు ?

# 7

ఒకడు నోటిని ఫ్యాక్టరీగా కడుపును గోడౌన్‌గా
మందులను లారీలుగా తోలుకొంటుంటే
మరొకడు నాలుకను ఆకురాయిగా డొక్కను ఇనుముక్కగా
మందులను రవ్వలుగా రేపుకొంటుంటే
వాడే బట్టల దుకాణం వంటికి చుట్టుకొని
కేతిగాడిలా వూరేగుతుంటే
వీడి గోచిపాత సిగ్గుపడి జారిపోయి
దిగంబరానికి మాసికగుడ్డయితే
మనం ఏం చేసేట్టు ?
దేశం ఏమయ్యేట్టు ?

పసివాళ్ళ కసికలం కత్తి పదును మీద అద్ది
చరిత్ర చెక్కుతుంటే
ప్రేమకు నిప్పుపెట్టి హింసాజ్వాలలకు కాలుతూ
చప్పట్లు కొడుతుంటే
దయకు గుండుసూది గుచ్చి కారేనెత్తురు
ఆరకుండా గీరి పుండుచేస్తుంటే
స్నేహం బేట్ విరక్కొట్టి స్టంప్స్ పారేసి
బాల్ దాచేసి ఎగతాళి చేస్తుంటే
మనం ఏం చేసేట్టు ?
దేశం ఏమయ్యేట్టు ?

నేటి బాలలు రేపటి పౌరులు కావటమేకాదు
నేటి పసినిర్భాగ్యులే రేపటి హంతకులు
నేటి బాధితులే రేపటి బాధ, పీడితులే పీడ
నేటి అరక్షితులు, అలక్షితులు, దుఃఖితులు
రేపటి హింస విద్వేషం దుఃఖం
అవుతుంటే గుడ్లు మిటకరించిచూస్తూ

మనం ఏంచేసేట్టు ?
దేశం ఏమయ్యేట్టు ?

నేటి బాలలు రేపటి పౌరులేకాదు
నిన్నటి నిర్భాగ్యబాలలే
నేటి దొంగలు రౌడీలు హంతకులు
స్మగ్లర్లు పీడకులు

వళ్ళొస్తే పెళ్ళికావటం
పెళ్ళయితే పిల్లలుపుట్టటం
మామూలే కావచ్చు.
రావణుడి రక్తంబొట్టు పడితే
రాక్షసులు లక్షలు పుట్టటం
మామూలే కావచ్చు
కాని పసివాళ్ళు బ్రతుకు నవభారతంలో
అభిమన్యులు బాలచంద్రులు కారాదు
విజయులు కావాలి.

అంతర్జాతీయ బాలల సంవత్సరం
భవిష్యత్తుమీద సందేహం
మనిషి మనుగడమీద సంశయం
మానవతమీద అనుమానం.

మీకు తెలుసు
నాకు లోకమంటే ఆకలి
దేశమంటే కేక
కాని నాకు తెలుసు
మీకు లోకమంటే సౌజన్యం
దేశమంటే సౌభాగ్యం.
మీరే ఋజువైతే ఎంత ఆనందం
నేనే నిజమైతే ఎంత విషాదం!

# ఆర్షభూమి

స్వతంత్ర భారతావనిని
పారిశ్రామికంగా వ్యావసాయికంగా పెంచాలని
కత్తీ సుత్తీ, కాడీజోడెద్లు ఢీకొంటే
పంట ఇంట పాతరై మూల్గింది.

తలలు పగలకొట్టుకొనే ఎద్లమగతనంలోంచి
అరుపులతో ఆవూ, దూకుళ్ళతో దూడవస్తే
ఆశాశయాలతో కడుపునిండింది.

గాదెలోంచి కాళీహస్తం లేస్తే
మనిషి నాగలితో పొలం పోగా
భుజమూ, నాగలి ములికీ, రక్కుకొని ముక్కలయ్యాయి.

ఈ దూడ ఎద్దై, ఆ ఎద్దు తోడై
కాడికోసం వెదుకుతుంటే
మనిషి నాగలీ కత్తీ కంకీతో సమీపించాడు.

గోదైవ వధ చేయక
పొలం పండక తినక
ఇసుకరేణువులైన కోట్ల ప్రజల
ఎడారి ఆర్షభూమి.

# భయం

విస్తరాకు ముక్కలు చేస్తారనీ
కట్టుపంచె చించి పోగేస్తారనీ
ఇల్లుపీకి పందిరేస్తారనీ
జనం తలా, గుండే, మెడా తీసుకొంటారనీ
గుళ్ళోకూర్చుని పూజ చేయమంటారనీ
విజయవాడ టౌన్‌బస్సుల్లా మీదపడతారనీ
తిండిలేక చెమటనూ కన్నీటిని తాగుతారనీ

నిజం చెప్పొద్దూ !
పిల్లల్ని కనాలంటే భయం.

సంతానం వద్దనుకొని
కళ్ళు కాళ్ళు చేతులు కట్టుకొని తపస్సు చేస్తుంటే
అనుమతి లేకుండా లోనికి వచ్చే ఆగంతకులులా
అప్లికేషన్ పెట్టకుండా ఉద్యోగం అడిగే రౌడీలులా
సీటు లేదన్నా బస్సుదిగిపోని తొందరప్రయాణికులులా
పోలీసు విజిల్ వినకుండా లైటులేని సైకిల్ తొక్కేవాళ్ళులా
లాకులెత్తితే దూకే జలంలా
టిక్కెట్లిస్తుంటే దూరే జనంలా
పుట్టి పెరిగి అరిచి అల్లరిచేసి పీడించి ఏడ్పించి
బ్రతుకొక నిత్యనూతన నిరంతర సమ్మె కావించే
నిజం చెప్పొద్దూ !
పిల్లల్ని కనాలంటే భయం.

నో వేకెన్సీ బోర్డు చూడని దరఖాస్తుదారుల్లా
హౌస్‌ఫుల్ లైటు చూడని సినిమా జనంలా

క్రిక్కిరిసిన రైలుపెట్టెలోకి పద్దన్నా చొరబడే
మొన్న థర్డ్‌క్లాస్, ఇవాళ సెకెండ్‌క్లాస్, రేపు ఫస్టుక్లాస్
ప్రయాణికులులా
పడి, గొడవచేసి, తోసుకుపోయి,
పసివాళ్ళు లెక్కాపక్కా లేకుండా
ఎక్కడ చూచినా సర్వాంతర్యాములైతే
ఏమీ పొందలేని దుగ్ధ దగ్ధ జీవులైతే
నిజం చెప్పొద్దూ !
పిల్లల్ని కనాలంటే భయం.

పసివాళ్ళను లోకం పద్మవ్యూహంలోకి
అభిమన్యులులా పంపలేక
పలకాబలపాలకట్ట జెమ్మికిచ్చిన
అజ్ఞాత పంచపాండవులులా చూడలేక
వాళ్లు పనిలేక ఆకలై గోళ్లు కొరుక్కుతినటం
ఆశల చందమామను అద్దంలో చాక్‌లెట్‌లా చప్పరించటం
ఆశయాల రాజకుమార్తెలను రాక్షసులనుంచి
రక్షించలేక పోవటం
భరించలేక, సరీగ్గా బ్రతికించలేక, బ్రతుకు చాలించలేక
నిజం చెప్పొద్దూ
పిల్లల్ని కనాలంటే భయం.

అరటి తొక్కమీద కాలుజారితే పడబోయి
పెట్టేపోజులా
కుక్క తరిమితే పరుగెత్తి ఆగి చుట్టూ చూచి
తెచ్చుకొనే నవ్వులా
ఉన్న ఒక్క పేంట్‌ని బస్సు బురద ఉతికి ఆరేస్తే
చూసే చూపులా
రైలు అందకుండాపోతే దిక్కుతోచక నిలబడ్డ
అవతారంలా

12

పసివాళ్ళు కోరలేక పొందలేక తట్టుకోలేక
దీనంగా హీనంగా మ్లానంగా బిక్కచచ్చి
నిరాశతో నిరూహతో నిస్పృహతో జీవిస్తుంటే
నిజం చెప్పొద్దూ !
పిల్లల్ని కనాలంటే భయం.

కన్నవాళ్ళకి సంతోషం తొడిగి ఆనందం చేతికిచ్చి
నవ్వుముఖాన అతికించి వీధిలోకి పంపితే
కోడిపిల్లలు కుక్కపిల్లలు పందిపిల్లలతో చేసే
స్నేహంచూడలేక

వేలకొద్దిజనంలో మైళ్ళపొడుగు లాటరీ క్యూలలో
తమవంతు అదృష్టంకోసం నిలబడివున్న
కన్నీళ్ళ పసివాళ్ళ ముఖాలు చూడలేకభరించలేక బ్రతకలేక
నిజం చెప్పొద్దూ !
పిల్లల్ని కనాలంటే భయం.

పసివాళ్ళ ముఖంలో స్వర్గం, కళ్ళలో దైవత్వం
కన్నా, మనిషంతా ఆశ కడుపంతా ఆకలికావటం సత్యం
ఆకలికి ప్రాణం పోసి వీధుల్లో తిప్పాలంటే
నిజం చెప్పొద్దూ!
పిల్లల్ని కనాలంటే భయం.

అక్షరాల కణతల్లో గుండుసూదులు గుచ్చి
ఫేక్టరీచక్రం పళ్ళలో ఇసుక కూరి
పొలంనోట్లో ఎండ్రిన్ పోసి
రోడ్డుమీద స్పీడ్బ్రేకర్స్ చెరిపేసి
చొక్కాలు చింపుకొని గుండెలు చీల్చుకొని
బ్రతుకు లారీలకు గుద్దుకొని బద్దలైపోయే
యువకుల్ని చూస్తూంటే

నిజం చెప్పొద్దూ!
పిల్లల్ని కనాలంటే భయం.

## 13

గతం పాడిన గీసిన రాసిన
నిరాశాగీతంలా దైన్యచిత్రంలా విషాదాంత నాటకంలా
ఉన్న బాలలు జాతి విలువల్ని, భవిష్యత్తునీ
అభ్యుదయాన్ని

దగ్ధం శాబటేజ్ హిజాక్ చేస్తుంటే
నిజం చెప్పొద్దూ!
పిల్లల్ని కనాలంటే భయం.

రాజకీయం పెద్దల సావిట్లో ఆవుగా
దేశ సంపద దొంగల జేబులో మనీపర్సుగా
న్యాయం పిచ్చివాడి చేతి బ్లేడుగా
జీవితం కల్లుతాగిన కోతిలా మారి
ప్రేమ గుండె అస్థిపంజరం కటకటాలలో బందీఅయి
స్వార్థం గుండీల్లేని గుండెలిరగదీసుకొని నడుస్తుంటే
నేటి పౌరులు నిన్నటి బాలలని తెలిసి
నిజం చెప్పొద్దూ!
పిల్లల్ని కనాలంటే భయం.

ఆర్షజాతి గంగానదీ పాత్ర పట్టుకొని
సింధునదీ నాగరికతను తాకట్టు పెట్టి
నైలునదీ నాగరికత ఇచ్చిన అప్పుతెచ్చి
కృష్ణా గోదావరీ తుంగభద్ర కన్నవాళ్ళకు అన్నం
పెడుతుంటే తింటుంటే, జనం బ్రతుకుతుంటే
నిజం చెప్పొద్దూ!
పిల్లల్ని కనాలంటే భయం.
బాలల సంవత్సరం
పిల్లల్ని కనమనే ఉత్సవంకాదు
వద్దని హెచ్చరిక
ప్రమాదమని వార్నింగ్
డేంజరని రెడ్ సిగ్నల్
నిజం చెప్పొద్దూ—

# ఏది అభ్యుదయం?

నాయకులు వినాయకులు
యువకులు ధనవంతులు పారిశ్రామికులు
అభ్యుయం వర్ధిస్తున్నారు వల్లిస్తున్నారు
లాలిస్తున్నారు పాలిస్తున్నారు పూజిస్తున్నారు
ఆహారంగా నిరాహారంగా
జోలపాటలలో కుండబొజ్జలలో బేంక్ లాకర్లలో
అంతా బాగానే వుందికానీ
అభ్యుదయమే అర్థంకాలేదు.

గండిపడ్డ మానవసంబంధాల రోడ్లమీద
విరిగిపడ్డ విద్యుత్ స్తంభాలు
వలయాలైన టెలిఫోన్ వైర్లు
కూలే నిర్మాణాలు డాములు
దేశాలు జీవితాలా అభ్యుదయం ?

ఉన్నవాడు ఉన్నట్లే ఉండటమా ?
దోచుకోవటమా ?
దోపిడీని చట్టబద్ధం చేయటమా ?
దొంగలే దొరలు కావటమా ?
మోసమే శాసించటమా ?

అరణ్య నాగరికతే
ఆధునిక జీవితమై,
బొమ్మా బొరుసాటలో
రూక తెగరేసి తలలు రాల్చటమై,

## 15

బతుకు గోళీలాటలో

బచ్చాదెబ్బలే రూల్లై,
గడియకొకమాట పిప్పరమెంటుగా కొరికి,
మనిషికొకనీతి గీతగా ఉపదేశించి,
అధికారం సాలెగూటికి ఎర పురుగులు విసిరి,
పూలు పుప్పొడి పరచిన పచ్చిగోతుల్లో
పసి ప్రపంచాన్ని లోతుగా పూడ్చటమా ?

కులం మతం భాష ప్రాంతం
అరలు పొరలు తెరలు మరలు వెనక నక్కి
నక్క జిత్తుల్లో సింహాలను కుక్కి
కుక్కిన పేనుల్లా చేసి;
ప్రాచీన నిశీథికి
బొట్టుపెట్టి పట్టంకట్టి భజనచేసి
ఎంగిలాకులు నాకే నేటి పట్టపగలును
మండుటెండ చౌరస్తాలో ఉరివేసి;
అంతరాత్మ ఆదేశాన్ని అక్షరాలా పాటిస్తున్నానని
ఆ విషాగ్నుల పురుటింటిలో
మంటల మాలలు కట్టి గొంతుకు చుట్టి
ఊపిరి తీయటమా ?

నిజం చెప్పలేక వేడీ వాడీ తగ్గిన
సూర్యుడు రావటమా ?
సిగ్గు విడిచి బిక్కచచ్చి సొమ్మసిల్లి
చంద్రుడు కుంకటమా ?
పొద్దుకుంకినతర్వాత ఉదయించి
పొద్దుపొడవకముందే అస్తమించి
చీకటికి ఊపిరిపోసి
రాత్రిని నగ్నంగా భగ్నంగా

మత్తుగా చిత్తుగా
విధితొొత్తుగా
విచ్చల విడిగా
బజారు కుక్కగా
అరటితొక్క తొక్కి పోయిన రోడ్డుగా
పగిలినసీసా పెంకుల పోగుగా
పోయిన ప్రాణం పోగొట్టుకొన్న నెత్తుటి రంగుగా
బద్దలైన శిలంలా
అమ్ముడైన మానంలా
అరుస్తున్న మౌనంలా
వేటాడబడ్డ అహింసలా శాంతిలా దయలా ప్రేమలా
పొంగిపొరలి వరదై పారిన వయస్సు గట్టర్‌లా
బట్టలిప్పేసిన ముసలికేబెరా నర్తకిలా
సొమ్ముపోయిన జూదగాడిలా మోసగాడిలా
మాయలాడిలా మాయలేడిలా
షాపులనియోన్‌లైట్లు మింగితే ఆరిపోయే
వీధి దీపాలులా
కూడు గూడు గుడ్డలేని వాడికి
వాన కురిసిన రోజులా
పన్నెండు గంటలకే నూరేళ్ళు నిండిన రాత్రి
ఉదయం కోసం ఎదురు చూడటమా అభ్యుదయం ?
ఏది అభ్యుదయం ?

# ఆ ట

చిన్నతనంలో నాకు
తినటానికి లేదు
కడుపునిండా ఆకలి వుండేది
కళ్ళలో ఆశ తొంగి చూచేది.

మా బీదతనం
పేగుల్లోకి మెతుకు పోనియ్యలేదు
నా ఆరోగ్యం
డొక్కలో మంటలార్పలేదు.

ఆకలి పేదరికం
కొట్లాడి
నా వళ్ళంతా
రగిలే కొలిమిని చేశాయి.

తిండి కోసం
కరుస్తున్న పేగుల్ని కట్టేసి
చెమట బొట్టును చీల్చి
బంగారం పుట్టించాను.

తిండి కోసం
కాటేసే పేగుల నాగుల్ని చుట్టేసి
మనస్సముద్రాన్ని మథించి
లక్ష్మిని వెలుపలికి తెచ్చాను.

తిండికోసం
అరుస్తున్న పేగుల నోరునొక్కి

## 18

కన్నీటిని నిలబెట్టి
వెన్నను సృష్టించాను.

తిండి కోసం
మండే పేగుల అగ్ని జ్వాలల్ని ఆర్పుతూ
గుండెగూటిని వెలిగించి
సంపద కాంతుల్ని కన్నాను.

ఇవాళ నేను
ఆస్తి వున్నవాణ్ణి
ఐశ్వర్యవంతుణ్ణి
కాని ఆకలిలేనివాణ్ణి.

ఆస్తి లేనప్పుడు ఆకలి మండింది
ఐశ్వర్యం ఉన్నిప్పుడు ఆకలి ఆరిపోయింది
ఈ ఆస్తి ఎంతతిన్నా తరగదు
అయితే
ఇప్పుడు ఏం తిన్నా అరగదు.

చిన్నప్పుడు నేను తూనీగల
రెక్కలతో ఆడుకొన్నాను
అప్పుడూ ఇప్పుడూ దేవుడు మా
డొక్కలతో ఆడుకొంటున్నాడు.

# సృష్టి

శ్మశానం
పుడమి మర్మస్థానం.

సమాధి
శృంగార చేష్ట.

శవం
వీర్యం.

గడ్డి పరక
కాలం మొలక.

కాలం నాణేనికి
శిథిలశక్తి బొరుసు
జీవకణం బొమ్మ.

# నేను

నేను పుట్టినపుడు
ఏడవ లేదు
ఎవ్వరూ నన్ను చూడలేదు.
అయితే నేను బ్రతికే ఉన్నాను
ఏకాకినీ కాను.

నేను పెరుగుతున్నప్పుడు
ఎవరూ నా బరువు తూయలేదు
నా ఎత్తు కొలవలేదు.
అయినా నాకు కొండంత బలగముంది
గుండెంత ప్రేమ వుంది.

నేను పుట్టింది రాళ్ళగుట్టల్లో
పెరిగింది పూరిగుడిసెల్లో.

కొన్ని రాళ్ళకు
ఇన్ని గుడిసెలకు తప్ప
నేనున్నానని
పెరుగుతున్నానని తెలియదు.

నేనున్న ఊళ్ళో
నాకు ఓటు లేదు
పుట్టించోటా లేదు
పెరిగించోటా లేదు.

నా ఉనికి లోకానికి తెలియదు
నేనుండీ లేనివాణ్ణి

నాది అనదగింది
నాకేదీ లేదు
ఈరోజు నాలుగు మెతుకులు
ఎక్కడ దొరుకుతాయో !
ఈ రాత్రికి నిద్రవస్తే
ఎక్కడ పడుకుంటానో !

ఇంత దేశం
ఇంత జనం ఉన్న నేను
ఏమీ లేకపోయినా
ఎంతో ఉన్నవాణ్ణి.

నా ముంత నీళ్ళు నాకు లేక
అన్ని నదుల నీళ్ళు తాగాను
నా కూడు నాకు లేక
ఉన్న కూళ్ళన్ని తిన్నాను
నా బట్ట నాకులేక
లోకంలో బట్టలన్నీ కట్టుకొన్నాను
నా యిల్లు నాకు లేక
దేశంలో ఇళ్ళన్నీ తిరిగాను
ఎప్పుడూ ఏమీ లేని నేను
ఇప్పుడెంతో ఉన్నవాణ్ణి.

అన్నీ ఉన్న నేను
కొన్నే ఉన్న వాళ్ళకంటే గొప్పవాణ్ణి
ఆ మాటకే వస్తే
నేను అపర పరమేశ్వరుణ్ణి.

## 22

నేను పుట్టినపుడు
        ఏడవలేదు
        ఎవరూ నన్ను చూడలేదు
అయితే నేను బ్రతికి ఉన్నాను
        ఏకాకినీ కాను.

నేను గిట్టినపుడు
        ఎవరూ నన్ను చూడలేదు
        ఏడవలేదు
అయితే నేను బ్రతికి లేను
        ఏకాకినీ కాను.

ఇక్కడొక్క మనవి
ఈ పరిస్థితులు ఇట్లాగే సాగితే
ఈ దేశాభ్యుదయానికే అనుమానం
ఈ మనుష్యుల మనుగడకే ప్రమాదం.

# మహాత్ముడు

వాడు పుడితే
ఇరుకు తడికిల్లు కాళీలేక మూలిగింది
వాడు కడుపు తడుంకొంటే
పేగుల్లో విశ్వం విశ్వరూపం దాల్చింది.

వాడు బట్ట కడితే
వెలుతురూ గాలీ వంటిమీద కొట్లాడుకున్నాయి
వాడు పడుకుంటే
గోనెపట్టా ఇంటికప్పూ నవ్వుకొన్నాయి.

చెరువుగట్టు మీద నిలిచి
'సీళ్ళో' అని అరిచాడు.
చెరువు ప్రతిధ్వనించింది.

అడవిలో కూర్చొని
'కూడో' అని కేక పెట్టాడు.
అడవిలో వెన్నెల కాచింది.

దొర్లే పేలికలు చుట్టుకొంటే
పొడుగుకొమ్ములతో పొడిచింది ఎద్దు
తాటాకుక్రింద తలదాచుకొంటే
మొరట గిట్టలతో తొక్కిందిమన్ను.

రాలిపడ్డ మెతుకులు తినబోతే
కోరపళ్ళతో కరిచింది కుక్క
ఊపిర్లేక యాలగిలబడితే
బతికుండగా పీక్కుతింది నక్క.

శబ్దం లేని నోరు తెరిచి
బలం లేని చేతులెత్తి
చూపులేని కళ్ళువిప్పి
అరిస్తే పిలిస్తే చూస్తే
మబ్బుముక్క ఘోషించింది
మట్టిగడ్డ రోదించింది.

సూర్యుళ్ళాంటి ఎర్రటికళ్ళతో
పొద్దుట్నుంచి సాయంకాలందాకా
ఆకాశం చూస్తూ రోదిస్తూ
చెమటను పేలిస్తే
చైతన్యం కూరిస్తే

బిగించిన పిడికిట్లో
బంగారం మొలిచింది
మట్టిని పట్టుకొంటే
మాణిక్యం పండింది.

రంకేసిన ఎద్దు
తోకముడిచింది.
తొక్కిన దున్న
తల వంచింది.
మొరిగిన కుక్క
కాలునాకింది.
పీకిన నక్క
పళ్ళికిలించింది.

నాలిగింటిని నరకాలని
ఎత్తిన గండ్రగొడ్డలి
ఏడుస్తుంటే
వాడు పైకి చూశాడు.

ఆకాశం కుండపోతగా కన్నీరు కురిసింది
నేలంతా కన్నీరు
నింగంతా కన్నీరు.

కన్నీటితో పొలమంతా
కడిగిన ముత్యంలాగ వుంది.
కన్నీటితో బ్రతుకుంతా
కడిగిన పుణ్యంలాగ వుంది.

ఎద్దు చుట్టుకొన్న బట్ట
దున్న ఉన్న పాక
కుక్క తినే కూడు
నక్క పొందే గూడు
వాడు కొనిపెట్టాడు
వాడు నిలబెట్టాడు.

ఇంతకంటే మహితాత్ముడు
ఇలలో ఇంకా పుట్టలేదు
ఇంతకంటే మహాత్ముడు
ఇంకెప్పుడో పుట్టబోడు.

# మనకేం?

అసభ్య చిత్రాలకు తారుపూస్తూ
అక్రమ సాహిత్యం తగలేస్తూ
హక్కులకు అమ్మాయిలు
సమ్మెలు చేశారు.

బెత్తెడు జాకెట్ డౌన్‌డౌన్,
అంటూ విద్యార్థులు వెంటబడితే
జాకెట్ దాచుకోలేక
కుంగిపోయిందో యువతి.

వంటగదికీ ఇంటిగదికీ
చెడని, ఆగని గడియారంలా తిరిగి
ఉండేలు బద్దలా
వంగిందో ఇల్లాలు.

కడుపు కోసం
శీలాన్ని ఖర్చు చేసుకొని
ప్రతి రాత్రీ వీధి భాగోతంలో
బ్రతుకుతూ వుందో పేద పిల్ల.

పగలు వెలుతురూ, రాత్రి చీకటీ చూడక
వళ్ళంతా శృంగారస్థానంగా
రాత్రంతా సజీవసమాధిగా
ఉందొక భూదేవి కన్న పసితల్లి.

మనకేం?

# చిరంజీవి మానవుడు

అలిసిన కళ్లు అద్ది
పుండైన కాళ్లు కడిగి
బడలిన ఒళ్లు రుద్ది
భారతదేశం పుణ్యస్త్రీ
స్నానం చేస్తూ వుంది.
తూచల్లోంచి చూడొద్దు
తూచల్లోపల ఉండొద్దు.

సమ్మెల తలనీళ్లు ఒత్తి
తగాదాల తడివళ్లు తుడిచి
వివాదాల చేతులు విదిల్చి
భారతదేశం మంగళాంగి
చీరమార్చుకొంటూ వుంది.
అటు తిరగొద్దు
అయిపు లేకుండా పోవద్దు.

ఎండే పొలాల పెదాలు తడిసి
తడబడే అడుగులు నిలిపి
గర్భంలో పంటల కాంతులు దాల్చి
భారతదేశం పవిత్రాత్మ
సిగ్గు శరీరంలో అదుముకొంది.
నవ్వొద్దు
నవ్వుల పాలు కావద్దు.

కాశ్మీర ముఖం చిట్లించి
ఉత్తరప్రదేశ కంఠం ఉబ్బించి

బీహార్ బెంగాల్ చేతులు బిగబట్టి
కేరళ తమిళనాడు కాళ్ళు నిగిడ్చి
భారతదేశం గర్భిణీస్త్రీ
ప్రసవవేదన పడుతూవుంది.
పరాచికాలు ఆడొద్దు
పరాభవం పొందొద్దు.

దారిద్ర్యం వళ్ళు తిమ్మిరెక్కి
కుల మతాల రక్త నాళాలు మంటపుట్టి
అసహనం అశాంతి నరాలు పోటెత్తి
అల్లాడిన పుత్రవతి
కొత్త నెత్తురు పట్టి
గుండె ఊటలు పుట్టి
ఆనందంలో పరవశించింది.
మోసం చెయ్యొద్దు
మోసమై పోవద్దు.

భారతదేశం
పచ్చిబాలింత
తేండి సహనం శాంతి పళ్ళూపూలు
ధర్మం న్యాయం పసుపూకుంకుమ

స్వతంత్రభారతి పసితల్లి
కట్టండి నీతి భవనాలు
నిజాయితీ తోరణాలు.
నాటండి సమైక్య బీజాలు
స్వేచ్ఛాంకురాలు.
వెలిగించండి సహజీవన దీపాలు
సామాన్యుల జీవితాలు.

ఆకలైన పసితండ్రి
ఆక్రందనలు విన్నారా ?
ఆనందంతో పిచ్చికన్న
కేరింతలు చూశారా ?

ఈ శబ్దం హిమగిరి ఒడిలో జారి
వింధ్య చెక్కిలి తాకి
తూర్పు పడమర కనుమల్లో
మార్మోగుతూ వుంది.

ఈ శబ్దం
కృష్ణనుంచి యమునకు
గంగనుంచి గోదావరికి
తుంగభద్రనుంచి కావేరికి ప్రాకి
త్రిదశల్లో తీరాల్లో
సముద్ర ఘోషా శంఖంలో
ప్రతిధ్వనిస్తూ ఉంది.

ఈ శబ్దం
సింధులోయలో మొలచి
గంగ మైదానంలో పండి
దక్కను పీఠభూమిలో నూర్పిడై
దేశమంతా పాతరయింది.

ఈ శబ్దం కుంభవృష్టిగా కురిసి
చెత్తాచెదారం ఆకులలములు
తోసుకుపోతే
దేశమంతా తోమిన రాగి పాత్ర.

ఈ ధ్వని ఆర్తుల గుండె ధ్వని
ఈ శబ్దం చైతన్య పునరారంభం.

ఈ ధ్వని దేశ ప్రతిధ్వని
ఈ శబ్దం మానవ విజయాబ్దం.
ఆసేతు శీతనగ పర్యంతం
పుణ్యస్థలి హోమవేదిక
అక్రమం అరాచకం ఆజ్యం
మహాయజ్ఞం.

కేరళనుంచి కాశ్మీరందాకా
ఆర్తుల హృది పంట పొలంలో
ఆత్మ విశ్వాసం కొత్తపైరు
మొలకెత్తింది
మహోదయం.

రాజస్థానం నుంచి బెంగాల్ దాకా
దేశమంతా
ధూర్త దుర్మార్గ దుష్టశక్తుల
పరాజయం పలాయనం
మహాప్రస్థానం మహాభినిష్క్రమణం.

వద్దన్నది చేయటం
చేయమన్నది మానటం
ఇంత కాలం మనజాతి జీవితం.
కోరింది తొలిగించటం
కోరంది కలిగించటం
ఇంతకాలం మన నీతి వర్తనం.

ఈ పసికేక ఇంకా పరాచికంగా ఉందా?
ప్రమాదం.

ఈ పసిగొంతు నులమాలని ఉందా ?
అపాయం.

పూవుతుంచి తీవకోసే మనిషీ !
చెట్టుఎక్కి మొదలు నరికే మహర్షీ !
నీ దొంగబుద్ధి బయటపడుతుంది
నీ కొంగజపం వెల్లడౌతుంది.

ఈ దేశం చూశావా ?
కళ్ళలో ముళ్ళు గుచ్చుకొన్నావా ?
ఈ ధ్వని విన్నావా ?
చెవుల్లో సీసం పోసుకొన్నావా ?
ఈ ఊళ్ళో ఉన్నావా ?
ఉరి పోసుకున్నావా ?

ఓ పెద్దమనిషీ !
ఓ పెత్తందారూ !
ఇంత కాలం
పండితే కొన్నావు
వండితే తిన్నావు
ఇంక పంటా వంటా నీదే !
యజమానివీ సేవకుడివీ నువ్వే !

ఆకలై పసిపెదాలు ఆకులు
ఒక్కముద్ద ఒక్కగుక్క
విద్యుత్తున్న గదిలా
ముఖమంతా వెలుతురు

ఆకలై నీముసలి పెదాలు రేకులు
రెండు పిడచలు రెండు గుటకలు

పొద్దున్న పృథ్వీలా
నీ తనువంతా కాంతి

నీ చేతిముద్ద తిన్న నోరు
నీకు ముద్దపెట్టిన చేతికి తల్లి.

కళ్ళుతేలేసిన మల్లెను నాటు
తెల్లారితే అది పిల్లల తల్లి
ఎంత పరవశం! ఎంత పరిమళం !

వీథిలో దొర్లే గింజను
పంట పొలంలో పాతు
రేపటికి వేలెడు మొక్క
పున్నమికి మనిషింత మాను.

నీ వెన్నెముకను ఎండ కాటేస్తే
నీడమందు రాసే చెట్టు
నీ లాంటి అనంత పథికులకు
ఎల్లప్పుడూ చలివేంద్రం

నీ కళ్ళకు కాళ్ళకు ఇది బలం
ఈ గూళ్ళకు ఊళ్ళకు ఇది వరం
ఈ తీగ గింజ ప్రమిద చిటికెడు
ఈ పూవు నీడ వెలుతురు ఊకెడు
ఇవేవీ నువ్ లేక ముందు లేవు
ఇవన్నీ నువ్ లేకపోయినా ఉన్నాయి.

నువ్వు అనుభవించిన హక్కు
నిన్ను సాగనంపింది.
నువ్వు నిర్వహించిన విధి
నిన్ను బ్రతికించింది.

విధిని పెంచే మహాత్ముడే
చిరంజీవి మానవుడు.

# వాడు

దారిద్ర్యాన్ని పాపిట్లో పెట్టుకొని
గోళ్ళు పెరిగితే కొరక్కుతిన్నాడు వాడు.

ఇంటికప్పు కన్నాలలోనుంచి ఆకాశంకన్నాలు
బ్రతికినన్నాళ్ళు లెక్కపెట్టినా
లెక్కతేలని లెక్కలురాని లెక్కలేనివాడు.

వీపుబండమీద చెమట నీళ్ళతో
ఉతికిన చొక్కాను శరీరం దండెంమీద
ఆరేసుకొన్నాడు తల వాల్చేసుకొన్నాడు.

పంటికి కంటికి నృత్యంనేర్పే
అన్నంలోని రాళ్లు జీర్ణంచేసుకొన్నాడు
గొంగళ్ళో తింటూ వెంట్రుకలు ఏరనివాడు
తల ఎత్తనివాడు తల కదపనివాడు

ఈ బోడిగుండుమీద
బొచ్చు పుట్టే దెప్పుడో!
క్రాపు అయ్యేదెప్పుడో!

# సంక్రాంతి

చెమట కురిస్తే
చేను తడిస్తే
పంట పాతరైతే—సంక్రాంతి.

పల్లె పిలిస్తే
నింగి పలికితే
నేల నవ్వితే—సంక్రాంతి.

మంచు మరకలతో
గడ్డిపరకలు మెరిస్తే
పొగమంచు పగలో
మనుషులంతా ఒకటైతే
పంటపాతర్లు వచ్చి
ఊరంతా పేరంటం పిలిస్తే—సంక్రాంతి.

శ్రమ తీగ తల మీద
మొలచిన పూవువంటి ఆనందం
కష్టం పైరు మీద
నిలచిన పంట వంటి సంతోషం
రూపెత్తితే-సంక్రాంతి.

ఈ ఏటికి ఆకలి లేదని
ఏ నాటికి కష్టం రాదని
వర్ణించిన ఊళ్ళకు
ఎత్తిన అభయ హస్తం—సంక్రాంతి.

ఈ ముంగిలి నుంచి
ఆ వీధినుంచి, ఈ వూరు నుంచి

పర్వతాల మీదగా, సముద్రాల మీదగా
ఆ దేశాలకు, అవతలి దేశాలకు
శాంతిముగ్గు సుఖంముగ్గు అహింసముగ్గు
వేయి తల్లీ సంక్రాంతి ముగ్గువేయి.

ద్వేషాల గడ్డి, విభేదాల కట్టెలు
బాధల పీచు, వ్యధల పేలికలు
వేసి చలిమంట రగుల్చు
దుప్పటి లేని జీవితాలకు
చలిమంట వెచ్చదనం కప్పు
చీకటి బ్రతుకులకు
చలిమంట వెలుగులు తిప్పు.

పిల్లల్లారా ! అటు పోవద్దు
కాళ్ళకక్రత్తులు కట్టుకొని
కోళ్ళు తన్నుకొంటున్నాయి
తాడో పేడో తప్పదు తన్నులాట.

ఓడిన కోడి
గెలిచిన కోడివాడి
విస్తట్లో కూడు.

కొట్టిన కోడికేమీ లేదు
పాపం తెల్లారితే
మళ్ళీ మొదలు
కొక్కురోరుకో.

గంగిరెద్దూ !
నీ రంగు పేలికలు రెండు
ఈ పాలిపోయిన ముఖాలకు అద్దు
నీ తలవూపు
మా హృదయాలకు రుద్దు
నువ్వు నడిచిన నేలంతా
మా గుండెల ముద్రలు నింపు
ఎంతదూరం నడుస్తావ్ ?
యజమానిని ఇంటికి పంపు.

పరికిణీ మువ్వన్నెల పతాకగా
పైట పచ్చని పొలంగా
బొట్టు సూర్యబింబంగా
నవ్వు శాంతిపావురంగా
గొబ్బితట్టు తల్లీ, గొబ్బెమ్మలు పెట్టు.

హరిదాసూ ! దయచేయి
చిరతలు సరిచేయి
పాతపాట వద్దు
బ్రతుకుపాట పాడు
మనిషి ఎలా మారాడు ?
మనం ఎలా ఉన్నాము ?
జనం ఏమి అయ్యారు ?
హరిదాసూ ! బ్రతుకుపాట పాడు
మనిషి నడతపాట పాడు

అక్షయ పాత్రలో
ధాన్యం మాటకేంలేగాని
ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధులు పోయించు
అరిషడ్వర్గం పారేయించు.

నీ కాళ్లు చూస్తే
మా కళ్ళ పండగ
నీ మాట వింటే
మా చెవుల పండగ
నీవల్ల ఈ సంక్రాంతి
మా పంచేంద్రియాలకు పండగ

బాల్యంలో
పోగొట్టుకొన్న
ఉత్సాహం
సంక్రాంతిలో దొరికింది.

యౌవనంలో
ఆబగా తిన్న
అన్నం
సంక్రాంతి వడ్డించింది.

బ్రతుకంతా
కొనుక్కొన్న
బలం
సంక్రాంతి ఇచ్చింది.

పల్లెలంతా తింటే,
బిచ్చగాళ్ళ కడుపులు
నిండిన లోగిళ్ళయితే,
ఆకలి చలిమంటలు
వీథుల్లో చల్లారితే,
అప్పుడు దేశానికి
సంక్రాంతి.

# జాగ్రత్త!

ఈ మనిషి నిప్పుకాలి పూజించినవాడు కాడు
నింగిలోకి రాకెట్ వదిలినవాడు.

వరదకు వంగొంగి మొక్కినవాడు కాడు
ఆనకట్టలు కట్టినవాడు

వాయువు దేవుడని చేతులెత్తినవాడు కాడు
గాలికి జోలపాట నేర్పిన వాడు.

పంచభూతాలను దేవుళ్ళని ప్రార్థించడు
వాటికి ప్రాణం పోస్తాడు.

నిన్న కాళ్ళు పట్టుకొన్నవాడు
ఇవాళ జుట్టు పట్టుకొంటున్నాడు.

ఊరి వెలుపల ఉన్నవాడు
ఊరిని వెలివేస్తున్నాడు.

ఆ పాత మంత్రాలకు
ఈ కొత్త చింతకాయలు రాలవు

ఆనాటి మంటలకు
ఈ పప్పులు ఉడకవు
జాగ్రత్త!

# భూకంపం

నేనీ నేల మీద పుట్టీ పెరిగి నమ్మి జీవించాను
ఇది నాది కాదని బెదిరించటం చూచి దుఃఖించాను.

పరాయికి కిరాయికి బ్రతికిన ఈ నేల మలినమయింది
తలవంచి మెడవంచి సిగ్గు చిమిడి శిథిలమయింది.

శిఖరం మీద శిఖరం మొలిచి దూరమయింది
గుంటలో గుంటపడి పాతాళం బాట పడింది.

దాస్య దుర్గంధం స్వేచ్ఛగా తిరుగుతూ వుంది
నిమ్నోన్నతాల రోతబొమ్మ సూపర్ బజారులో
అమ్ముడవుతూ వుంది.

ఈ గాలి పీల్చ లేను, ఈ దృశ్యం చూళ్ళేను
సొంత గడ్డ మీద విదేశీయుళ్ళా ఉండలేను.

భూకంపం పుట్టి, కంపు చచ్చి, మట్టి చదునై
నేలంతా కలిసి, బ్రతుకంతా పండి, నా భూమి నాకు కావాలి
నేనున్నా లేకున్నా నా యీ నేల నాకుండాలి.

# సమైక్యత వద్దు

మనకు సమైక్యత వద్దు
అది మన సంగతి కాదు.

మనం ఒకటిగా వుండే
చాతుర్వర్ణ్యం సృష్టించాం
పంచముల్ని ప్రసవించాం
బౌద్ధులన్నాం జైనులన్నాం
మహమ్మదీయుల్నికన్నాం
క్రైస్తవుల్ని కానిచ్చాం
హరిజనుల్ని పెంచాం
చీలికల చలివేంద్రంలో
చల్లని తీర్థం సేవించాం
విభేదాల ఊడలు పట్టుకొని
ఉయ్యాల లూగాం
మనకు సమైక్యత వద్దు
అది మన సంగతి కాదు.

మనం కలిసి వుండే
దేవుళ్ళను స్వర్గస్థుల్ని చేశాం
దెయ్యాలను లోకస్థుల్ని చేశాం
గాంధీని పిస్తోలుతో కూల్చాం
కోచేసును కిరసనాయిలుతో కాల్చాం
పదవుల కోసం
మెడకాయలు తరుక్కొన్నాం
తలకాయలతో ఆడుకొన్నాం

చచ్చినా ఈ గోలకు పోవద్దు
అది మన సంగతి కాదు.

మనం సమైక్యమయి
హిందీ వద్దన్నాం
ఉక్కు కావాలన్నాం
బస్సులు కాల్చాం
రైళ్ళు పేల్చాం
ఎక్కడో హరహరా
ఇంకెక్కడో శివశివా
అక్కడ శివసేన లేస్తే
ఇక్కడ శవసేన చూశాం

కలకత్తాలో ప్రొఫెసరు మెడతో
విద్యార్థికి పనిపడితే
అన్నామలైలో విద్యార్థి తలకాయ
విద్యార్థికే అవసరం
ఢిల్లీ యూనివర్సిటీలో
బాంబులు పేలితే
బెనారసులో వణికింది
పోలీసు బృందం
బొంబాయిలో
దక్షిణ దేశం తగలబడితే
మద్రాసులో
మళయాళం దగ్ధం

అంతా
కడుపు నిండితే కైలాసంగాళ్ళు
ఎవడెట్లాపోతే మనకేంగాళ్ళు
మనకు సమైక్యత వద్దు
అది మన సంగతి కాదు.

జనం సిగ్గు చొక్కా
రోడ్డు మీద పారేశారు.
ఎండకు వీపు చూపేసి
విచ్చలవిడిగా తిరుగుతున్నారు.

అబద్ధాల వాడలో
దొంగ చరిత్ర నీడలో
పుక్కిటి పురాణాల మేడలో
జాతి సంస్కృతిని పెంచుతూ వుంది.
నాగరికతను తయారు చేస్తూవుంది.

ఈ చరిత్ర మురికి బట్టను
ఉతికి ఆరేయాలి.
ఈ పురాణ విషవృక్షం
నరికి పారేయాలి.

నా జాతి
ఈ చలవ బట్ట కట్టుకొని
చైతన్యంతో వికసించాలి.
ఈ మొదళ్ళు మళ్ళీ
అభ్యుదయం చిగురించాలి.

# అవును మొనగాళ్ళం

మనమంతా తెలుగోళ్ళం
మళ్ళీ మాట్లాడితే మొనగాళ్ళం
కాదన్న మాదన్న ఎవడన్నా వుంటే
ఇటు రమ్మనండి
కఱ్ఱపుచ్చుకొని తగిలేద్దాం, కాదంటే
కాలికి బుద్ధి చెప్పేద్దాం.

ఆంధ్రరాష్ట్రం కావాలీ కావాలీ అన్నాం
అఖిలాంధ్రం రావాలీ రావాలీ అన్నాం
అక్కడో పుణ్యాత్ముడు హరీ అంటే
ఇక్కడ మనమంతా సరే అన్నాం.

రైళ్ళాపాం
రోడ్లాపాం
బస్సు కాల్చాం
నెత్తి కాల్చుకొన్నాం.

అదిగో అప్పుడు
ఆంధ్ర రాష్ట్రమూ వచ్చింద
విశాలాంధ్రమూ అయింది.

ఇక ఇప్పుడేంటంటే
తెల్లముఖాలు చూచుకొన్నాం
మనమంతా తెలుగోళ్ళం
మళ్ళీ మాట్లాడితే మొనగాళ్ళం!

ముక్కోటి ఆంధ్రులం
ఒక్కటవ్వాలన్నాం

అయిపోయాం
ఆరుకోట్లు అయిపోయాం.

మాతృభాషకు ప్రాధాన్యం కావాలి
వచ్చేసింది !
ఇంగ్లీషు వద్దు
పోయింది !
తెలుగు బోధన
సరి సరే !
ఇప్పుడు తెలుగుభాషా వద్దు బోధనా వద్దు
అనే కొడుకుల్ని కన్న తండ్రులం పితృదేవుల
మనమంతా తెలుగోళ్ళం.
మళ్ళీ మాట్లాడితే మొనగాళ్ళం!

ఆంధ్రులంతా అన్నదమ్ములనుకొన్నాం
అనేసుకొన్నాం
సరిపోందని
సరే లెమ్మనుకున్నాం.
తెల్లారేసరికి కళ్ళు బైర్లు కమ్మి
తెలుగోళ్ళంతా ఒకటి కాదని
తెలంగాణా వేరనీ, ఆంధ్ర వేరనీ
వాళ్ళు దోచుకొంటున్నారనీ
కోసుకొంటున్నారనీ
సొంతం చేసుకొంటున్నారనీ
అనేసుకొన్నాం
అంతే మనిల్లు మనం
వల్లకాడు చేసుకొన్నదాకా
నిద్ర పోలేకపోయిన
మనమంతా తెలుగోళ్ళం
మళ్ళీ మాట్లాడితే మొనగాళ్ళం!

మతం భగవంతుడి మారుపేరు
కులం ఆ దేవుడి వూరుపేరు
ఊరూ పేరూ లేని వాళ్ళకి
భగవంతుడు పెద్దదిక్కు.

దేవుడి కోసం
మానవుడి గొంతు కోయటం
వేదోక్తంగా భావించే మనం
ఈ వూళ్ళో గాలి పీల్చి
మరో ఊళ్ళో వదిలే మనం
ఏం చెప్పేది ?
మనమంతా తెలుగోళ్ళం
మళ్ళీ మాట్లాడితే మొనగాళ్ళం!

గీత, ఖురాను, బైబిల్
ఒకదాన్ని ఒకటి చూచి
ఒంటికి పోసుకునే లోకంలో,
మాంసం తినేవాడు, తిననివాడు
పూజచేసేవాడు, చేయనివాడు
నిద్రపోయేవాడు, పోనివాడు
బ్రతికి ఉన్నవాడు, లేనివాడు
గిల్లుకొనే సంఘంలో
కులం ఊపిరి,
మతం రక్తంగా
మనుష్యులు.
కులమతాల గూటిలో, గోతిలో
పుట్టీ చచ్చే మనుష్యులు.
కులం బలం మీద
అనుబంధాల భవనాలు లేస్తుంటే
ఏమంటే ఏముంది ?

మనమంతా తెలుగోళ్ళం
మళ్ళీ మాట్లాడితే మొనగాళ్ళం!

డబ్బు భగవంతుడి దయ
అది ఉన్న వాడింట్లో వాకిట్లో
కుక్కలా పడివుంటాడు దేవుడు
డబ్బున్నవాడు దేవుడి కొడుకు
లేనివాడు దెయ్యం కొడుకు
కొడుకు లిద్దరూ కొరకరాని కొయ్యలు
బద్ధ శత్రువులు.

ఊపిరాడినా ఆడకపోయినా
ఉన్నవాడికి ఉన్నచోటే
లేనివాడికి లేనిచోటే
ఈ ఉన్న లేని తనం
మనముండక ముందునుంచీ వుంది
మానవుడుండక ముందునుంచీ వుంది.
ఈ ఉన్న లేని తనం,
కలనేత గొంగళి
చిరంజీవి సర్వాంతర్యామి
దీన్ని తీయటం ప్రమాదకరం
దాయటం అనవసరం.
అంచేత దాని జోలికి మనం పోం
దాన్ని రూపుమాపలేం
మనమంతా తెలుగోళ్ళం
మళ్ళీ మాట్లాడితే మొనగాళ్ళం.
కాదన్న మాదన్న ఎవడన్నా ఉంటే
ఇటు రమ్మనండి
కర్ర పుచ్చుకొని తగిలేద్దాం, కాదంటే
కాలికి బుద్ధి చెపేద్దాం!
మన మంతా తెలుగోళ్ళం
మళ్ళీ మాట్లాడితే మొనగాళ్ళం
అవును మొనగాళ్ళం!

# తెగిన గాలిపటం

నగరం గగనం మీద గాలిపటాలు
పసివాళ్ళ విజయం ప్రకటించాయి.

దారం మంగళసూత్రంలా తెగి
వీథినిండా చిరగని కదలని గాలిపటాలు.

పొద్దుణ్ణుంచి సాయంకాలందాకా
ఉరుకులు పరుగులతో వాటిని పోగుచేశాను.

ఎన్ని రంగులు! ఎన్ని రంగులు!
ఆకాశంలోని ఇంద్రధనుస్సు కరిగి కురిసింది.

వాటి చూపుల సూదులు వేదన అద్దుకొని
గుండెకు ఎంబ్రాయిడరీ బోర్డరు కుడుతున్నాయి.
రాత్రి గదిలో సముద్ర ఘోష గుండె ధ్వనికి
దుఃఖ భాష్యం వినిపిస్తూ వుంది.
చీకటి నిశ్శబ్దం బరువుకి ఆరుస్తూ వుంది.
నిద్ర కనురెప్పల గదుల్లో బల్బుగా వెలుగుతూ వుంది.

ఈ పటాలను ఏం చేసుకోను ?
చేతిలో దారాలు లేనివాణ్ణి !

# ప్రగతి

కాలవల
గళ్ళ పరికిణీ కట్టుకొని,
పచ్చని పంట చేల
పైట వేసుకొని,
ఉదయించే సూర్యుణ్ణి
నుదుట పెట్టుకొని,
పల్లె పడుచు పిల్ల
పరవశిస్తూ వుంది.

ఆకులు రాలి
          చిగుళ్లు పులకించి,
సహకారం పూతపూసి
          పిందెవేసి,
మల్లెతీగ మొగ్గ తొడిగి
          పూవు పూసి,
కొత్త చివురు కేకపెట్టి
          సోనపట్టి,
పల్లె పడుచు పిల్ల
ఉల్లం చిందులు వేసింది.

ఉత్సాహం ఊపిరిగా
ఆనందం రక్తంగా
ఆశలు అవయవాలుగా
స్వేచ్ఛను తింటూ
మానవత్వం తాగుతూ
సమానత్వం పీలుస్తూ

పల్లె పడుచుపిల్ల
వెల్లువలా పొంగింది.

ఏటేటా కాంతి కులికి
అయిదేళ్ళకు పుడమి వెలిగి
పాతికేళ్ళకు వెన్నెల ప్రాణంగా లేచి
నిండు జీవితంలో
పండు యౌవనంలో
పల్లె పడుచు పిల్ల
చల్లని చంద్రికలు చిమ్మింది.

మతం
ఊరజెరువు గట్టుమీద
రావిచెట్టు కింద
మందుతూ వుంది.

కులం
ఊరబావి చప్టామీద
అంటుకొంటూ వుంది.

ఉన్నతనం
లేనితనాన్ని
ఊరెలపల బాధుతూ వుంది.

వైరితనం
దేవుడి ముఖాన
బద్దలవుతూ వుంది.

అశాంతి ఆందోళన
హింస అలజడి
పులుల్లా నోళ్ళు తెరిచాయి.

ఊరూరా దేశం పెట్టుకున్న
కన్నీరులా సముద్రం పొంగింది.
చెట్టూ పుట్టా గుట్టా గట్టూ
ఏకం చేసింది
వెనక్కు పోయింది.
తీరం అలికిన ఇల్లులా వుంది
పల్లె ప్రాంతం కడిగిన ముత్యంలా వుంది
దేశం ఇస్త్రీ బట్టలా వుంది
పల్లె పడుచు పిల్ల
పెళ్ళికూతురులా తలవంచుకొంది.

వినువీధి నుంచి నీటిబొట్లు
వేకువలో వర్షించాయి.
నింగంతా పొంగింది.
నేలంతా నానింది.
పల్లె పడుచు పిల్ల
కడుపు పండింది.

పల్లె చీకటి కళ్ళలో
విద్యుత్తు చూపులు మొలిచి
మొండి తలలో
అక్షరాల నరాలు పొంగి
పిచ్చి గుండెలో
అభ్యుదయ ధైర్యం నిండి
వెర్రి తనువులో
అభివృద్ధి రక్తం సాగి
పల్లె పడుచు పిల్ల
చల్లని తల్లి అవుతూ వుంది.

సమానత సహజీవనత
ఊపిరి తిత్తులుగా
ఆనందం ఆహ్లాదం
గుండె ధ్వనులుగా
ఆవేశం ఆలోచనం
సిరలు ధమనులుగా
భవిష్యత్తు పసిబాబును
పల్లెతల్లి ప్రసవిస్తుంది.

ఈ తల్లి తనువు
ఆశావల్లరి
పుష్పిస్తుంది
పరిమళిస్తుంది.

ఈ తల్లి ఉరస్థలి
పయోనిధి
వెల్లువగా పొంగుతుంది
ప్రాణాలను పెంచుతుంది.

ఈ తల్లి నేత్రాలు
సూర్యచంద్రులు
అహోరాత్రాలు వెలుగుతాయి
వెలిగిస్తాయి.

ఈ పల్లె మనిషి
ఈ నేలకు ప్రాణమయినవాడు
సూర్యకిరణం ఘనీభవించి
చంద్రాంశువు చైతన్యంగా
అమృతబిందువు గుండె బంధువుగా
ప్రాణప్రతిష్ఠ పొందినవాడు,

ఈ మనిషిని
చీకటి తాకదు
చలి వణికించదు
భయం దరిచేరదు.

ఈ పల్లె మనిషి
నీటి బొట్టు,
మట్టిపెద్ద పెంచితే
మానైన మనిషి.

ఈ మనిషి
ఉడతూపులకు బెదరడు
పిచ్చిగాలులకు చలింపడు.

ఈ పల్లె మనిషి
సాన బట్టిన వజ్ర చైతన్యం
రాజకీయ కల్లోలినిలో
ఊగిసలాట కాదు
రాజరికానికి ఊట.
పెట్టుబడిదారుల చదరంగంలో
పావు కాదు
వ్యవసాయానికి పెట్టుబడి.

ఈ పల్లె మనిషి
వర్షించిన నవజీవనం
ఈ మనిషి
అధికారులకు తలవంచిన బైతుకాదు
హద్దు తెలిపిన రైతు
యజమాని కాలి కూలి కాదు
పంట ఇచ్చిన పరమాత్ముడు.

ఈ పల్లెలు
కాలి బాటలు కావు
పూల బాటలు.

ఇవి
పూరి గుడిసెలు కావు
పెంకుటిళ్ళు.

ఈ పల్లెలు
మానవ నాగరికతా శిథిలాలు కావు
శిఖరాలు.

ఇవి
దేవుళ్ళ శాపాలు కావు
దేవాలయాలు.

ఈ పల్లెలు
చీకటి పెట్టిన పిల్లలు కావు
వెలుతురు కన్న బిడ్డలు.

ఇవి
గత వైభవంలో మైలు రాళ్ళు కావు.
భవిష్యదభ్యుదయంలో పునాదిరాళ్ళు.

ఈ జనం
దుష్టవ్యవస్థలోని దుర్గంధం కాదు
ఉత్కృష్ట జీవనంలోని పరిమళం.

ఈ పరిమళం
పల్లెల్ని వెలుగు వెల్లువల్ని చేస్తుంది
పట్టణాల్ని పండిస్తుంది
దేశాన్ని బ్రతికిస్తుంది.

# కానివాడు

సర్కారు జిల్లాలలో ఎండాకాలం
ఇళ్ళు కాలతాయి.

బీదవాళ్ళకు ఎల్లప్పుడూ
కడుపులు మాడతాయి.

కొందరికి వొళ్ళు మండుతుంది
గుండె భగ్గుమంటుంది.
తల పేలి పోతుంది.

ఏం తగలబడ్డా
కారణం
వాటి యజమాని కాదు
కానివాడు.

# అంటు కొమ్మ

మా పెరట్లో
గులాబీ బొండుమల్లె
గుసగుస లాడుతున్నాయి.

భారత యోధుల నెత్తురు రంగుగా
శాంతికపోతాల రెక్కలు రేకులుగా
గులాబి పువ్వు నవ్వై వికసించింది.

ఆర్ష సంస్కృతి ఆకారంగా
అభ్యుదయం పరిమళంగా
బొండుమల్లె రేకులరెప్పలు విప్పింది.

నేను బాల్యంలోని ఉత్సాహం కొద్దీ
ఆ రెండు కొమ్మల్నీ
అంటు గట్టాను కలిపి కుట్టాను.

ఈ కొత్త కొమ్మ కొంత కాలానికి
తల నిండా పూలు పెట్టుకొంది.

ఈ కొత్త పూలు ఈ కొత్త తల్లి
తలంతా విరబూశాయి.
తేనె ముద్దులతో నింపాయి.

ఇవి గులాబీలూ కావు
మల్లెలూ కావు.
వీటి రంగు ఏ గులాబీకీ లేదు
వీటి పరిమళం ఏ మల్లెకూ రాదు.

ఈ పూలకు ఏ పేరూ లేదు
ఇక పేరేదో పెట్టటం నా కిష్టం లేదు.

ఈ పూల సొగసు సోయగాలు చూచి
తోటలోని పూలన్నీ
వెర్రెక్కిపోతున్నాయి.
చేరువా అవుతున్నాయి.

ఒక కొమ్మకు మరోకొమ్మ
వయ్యారంగా చెయ్యందిస్తే
కలిపి కుడుతున్నాను
అంటు కడుతున్నాను.

నాకు తెలుసు
ఒకనాటికి
మా తోటంతా ఈ పూలే పూస్తాయి
పరిమళిస్తాయి.

నాకు తెలుసు
ఒకనాటికి
మా తోటంతా ఈ పూలే పరిపాలిస్తాయి
భవిష్యత్తును శాసిస్తాయి

ఈ పూలతో సాగే
బాటసారిని నేను
ఆ రోజు కోసం చూచే
తోటమాలిని నేను.

# ఖాయం

అప్పుడు సత్యాగ్రహం ఆటంకాలు
ఇప్పుడు సమ్మె దుమ్ము ధూళి.

అది అధికారం కొమ్ములు వంచింది
ఇది అధికారం ముందు తలవంచింది.

అక్కడ పీడన పునాదులు పేలాయి
ఇక్కడ హింస శిఖరాలు నిలిచాయి.

ఇంతవరకు ఈ దేశంలో సమ్మెలు
మనిషికి కావలసినవాటికోసం జరిగాయి.

ఇకముందు సమ్మెలు ఈ జనం
మనుష్యులు కావటం కోసం జరుగుతాయి.

అంతలోగా, జాగ్రత్త తగ్గితే,
భవిష్యత్తరాలకు
మరో మొహంజదారో
మరో హరప్ప
ఖాయం.

# నువ్ నా కేమౌతావ్

అమ్మా అనలేను నిన్ను
యాఁవే అనరాదు నేను
భూమీ !
కన్నతల్లివా ?
కట్టుకొన్న పెళ్ళానివా ?

ఆదినుంచి అనాదినుంచి
వేదకాలంనుంచి నిర్వేదకాలంనుంచి
పుట్టినవాళ్ళకి చచ్చినవాళ్ళకి
పుట్టలేక చచ్చినవాళ్ళకీ
చావలేక పుట్టినవాళ్ళకీ
పుడుతూ చచ్చినవాళ్ళకీ
చస్తూ పుట్టిన వాళ్ళకి
తల్లివట !
ఎప్పుడూ తల్లివేనా ?
ఎవడికన్నా పెళ్ళానివా ?
భార్యవు కాకుండా అమ్మవా ?
పిల్లల్ని కనకుండా తల్లివా ?

బాబాలు - వాళ్ళ బాకాలు
దేవుళ్ళు - వాళ్ళ తూటాలు
రోజుకొకడు పుడుతూ చస్తూ వుంటే
భూమీ !
నువ్ పుట్టిందెప్పుడు ?
చచ్చేదెప్పుడు ?
మాకు విముక్తి ఎప్పుడు ?

భూపతి కొడుకు భూపతి
భూపతి తండ్రి భూపతి
భూపతులందరికీ పెళ్ళానివా !
ఎవడికన్నా తల్లివా ?

భూపతులు నేడు చెల్లని వల్లకాళ్లు
జమీందార్లివాళ సమాధుల జిల్లేళ్లు

ఇప్పుడు నీ కెవడు మొగుడు ?
మొగుళ్ళేకుండా పెళ్ళానివా ?
మా నాన్నా నేనూ నా కొడుకూ
మా తాత ముత్తాతల వంశాలు
మా సంతానాల తరతరాలు
నిన్ను దువ్వి దున్ని తడిపి
లాలించి పాలించి పోషించి
నీ కడుపు పండించాం.

ఎండలేదు వానలేదు
రాత్రిలేదు పగలులేదు
మా అందరితో నిరంతరం
వ్యభిచారం చేశావ్.
త్రికరణశుద్ధిగా, త్రికాలాబాధితంగా
త్రిమూర్తులు సాక్ష్యంగా
వ్యభిచారం చేశావ్ !
మాతో చేయించావ్
సిగ్గులేదూ !
ఎందుకిలా చేశావ్ ?
మాలో ఎవడికి తల్లివి ?
ఎవడికి పెళ్ళానివి ?

మా వొంట్లో చెమట గంగ
వాడింట్లో మణుల గని
సంసారం మాతో చేశావ్
సంతానం వాడికిచ్చావ్
మా బిడ్డకు వాడి పేరు పెట్టావు
నోట దుమ్ము కొట్టావు.
నువ్వు మనిషివా ?
దెయ్యానివా ? రాక్షసివా ?

ఇక్కడ రగిలిన ఆకలిని
అక్కడెక్కడో ఆర్పుతున్నావు
ఇక్కడ పొంగి పోటెత్తి కళకళ్ళెత్తి సుడు
లెత్తిన వాళ్ళను
అక్కడెక్కడో దువ్వుతున్నావు.

నోట మట్టిబెట్టి కంట కారంకొట్టి
నవ్వుతూ రాళ్ళు రువ్వుతూ
కావ్వెక్కి కొట్టుకొంటున్నావు.

అమ్మా అనలేను నిన్ను
యాఁవే అనరాదు నేను
భూమీ ! కన్నతల్లివా ?
కట్టుకొన్న పెళ్లానివా?

నాకు తెలుసు
నువ్ ఉన్నవాడి పెళ్లానివి
లేనివాడి తల్లివి
నేను లేనివాడి కొడుకును
ఉన్నవాడి తండ్రిని
భూమీ ! నువ్ నాకేమౌతావ్ !

నిన్నటిదాకా లేనివాణ్ణి
ఇవాళ ఉన్నవాణ్ణి
భూమీ! నువ్ నాకేమౌతావ్ !
ఎందుకే సతాయిస్తావ్ ?
నువ్ నాకేమౌతావ్ ?

# హృదయాలయం

వెయ్యి ఏనుగులు
ఒక్కసారి ఘీంకరించినట్లు,
వెయ్యి జలపాతాలు
ఒక్క పెట్టున మోగినట్లు,
కోటి ఉరుములు
కోటి మెరుపులు
బుద్ధిని బద్దలు చేస్తున్నాయి
గుండెను పుండును కావిస్తున్నాయి.

వంద నందనవనాలు
ఒక్కసారి పుష్పించినట్లు,
వేల విద్యుద్దీపాలు
ఒకేసారి వెలిగినట్లు,
తనువంతా పరిమళం
తలంతా కాంతులు
ఊపిరి సలపనివ్వటం లేదు
చూపు ఆననివ్వటం లేదు.

నరాల తీగల్లో
నాకు తెలియని తంతివార్తలు
గుండె కోనలో
అవ్యక్త మధుర సంగీత ధ్వనులు.
కను కొలుకుల్లో
కనిపించని వర్ణ చిత్రాలు.

అరలు తొలగి పొరలు తొలగి
కలల్లోని కమ్మని బొమ్మలు.

వెన్నెముక నిచ్చెనమీద
మంచులాంటి చేతులూ
వెన్నలాంటి పాదాలూ
తాకుతున్న దూకుతున్న జాడలు నీడలు

హృదయ రక్తనది వంతెనమీద
పూల అడుగుల నడకల
పరుగుల సవ్వడులు.

తీయని మరమేకులు
కమ్మని రంపాలు
హాయి అయిన సమ్మెటలు
గుండెను తొలుస్తున్నాయి
కోస్తున్నాయి
కొడుతున్నాయి.

మధుర వేదనలు
మనస్సు పూలచెట్టును
మరీమరీ విదిలిస్తున్నాయి
కదిలిస్తున్నాయి.
ఆనందస్రోతస్విని అంచున
అమృతం కురిపిస్తున్నాయి
ప్రవహిస్తున్నాయి.

కళ్ళు మూసుకుంటే
కనిపించే సుందర దృశ్యాలు
కనురెప్పల తలుపులు తీస్తే
కదిలిపోతున్న వెన్నెలవాగులు.

నా శరీరం వీణను
నా మనస్సు మీటను
నా నరాల తీగలను
కదిలించి కుదిలించి
నా హృదయాన్ని పలికించే
ఈ అమాయికపు అల్లరిమూక
నా ప్రాణానికి వెన్నెలవాక.

ఈ వినిపించని సంగీతం
ఈ కనిపించని సాహిత్యం
ఏ నాటికో వినిపిస్తుంది.
కనిపిస్తుంది.
ఆ నాడు
నన్నాడించిన ఉడికించిన
పలికించిన రాయించిన
ఈ అమాయికపు అల్లరిమూక
నా గుండెకు ప్రతినిధిగా
నా హృదయానికి ఆలయంగా
నాకు శాశ్వతత్వం ప్రసాదిస్తుంది.

# సుందరదీపం

పద్మాలు నీళ్ళలో కళ్ళు
కళ్ళు నీళ్ళతో పద్మాలు.

పద్మం కన్నయితే అలంకారం
కన్ను పద్మమయితే అహంకారం.

నీళ్ళు కళ్ళలో తొణికినా
కొలనులో కదిలినా
ప్రకృతిలో కొత్త వూపిరి.

నీటిబొట్టు పద్మంమీద ముత్యం
కంటిలో జీవనసత్యం.

మోదమో విషాదమో
చెమ్మగిల్లే నేత్రం
చైతన్యకేంద్రం
సుందరదీపం.

# ప్రయత్నం

లోకం ప్రమిదలో
తరిగిననూనె తిరిగి పోయాలనీ,
జారిన ఒత్తి పైకెత్తాలనీ,
ఆరిన శిఖ వెలిగించాలనీ,
వచ్చే కంపును పోగొట్టాలనీ,
దాని అస్తిత్వానికి అర్థం కలిగించాలని
పొద్దు పొడిచిం దగ్గర్నుంచి
మళ్ళీ పొద్దు పలకరించేదాకా
పురాణకాలంనుంచి
ప్రయత్నిస్తూనే వున్నాను.
అన్నీ ఉన్నాయి,
శిఖే లేదు.

# అదంతే

ఎన్నో రాళ్లు
అన్నీ శిలలూ కావు, శిల్పాలూ కావు.

ఎన్నో శిల్పాలు
అన్నీ దేవుళ్లూ కావు, గుళ్లూ లేవు.

ఎన్నో గుళ్లు
అన్నీ పుణ్యాలూ తేవు, పూజలూ పొందవు.

ఎన్నో పూజలు
అన్నీ పరమార్థమూ ఈవు, ప్రయోజనకరమూకావు.

ఒకరాయి పూజ పొందటం
మరొకటి సున్నం కావటం
అర్హతా కాదు
అవసరమూ కాదు
అదంతే.

# శవ సంస్కారం

లోకం జైలులో అస్థిపంజరం గదిలో
గుండెకాయ యావజ్జీవ శిక్ష పొందిన ఖైదీ!

సిగ్గుకోసం కట్టుకొన్న శరీరవస్త్రం
నడిబజార్లో నలుగుర్లో వలుస్తుంటే
బక్కచచ్చి నిలబడ్డ ద్రౌపది ప్రాణం.

అర్ధరాత్రి ఆకస్మికంగా ఆకాశంలో
పంచమస్వర మాలపించిన కోకిల
ఏక్సిడెంట్‌లో పోయిన ఊపిరి.

చీకటిని ఉరి తీయమని
ఉదయపు వెలుతురులో కాలంకలం అద్ది
సమాజం మీద సంతకం చేశాను.

చీకటి శవం ఉదయం రాక్షసిబొగ్గుచితిలో
కణకణ మండుతూవుంది.

# ఆ నేల ఉండదు

అన్ని నుదుటి ముడతలు
ఎన్ని అనుభూతులు
చిక్కుపడ్డాయో!

ఈ అస్థి పంజరం
ఎంత కండ బరువు
మోసిందో!

ఈ నల్ల జుట్టు బొగ్గు కాలి
ఎలా తెల్ల జుట్టు బూడిదగా
మిగిలిందో!

బ్రతికి బ్రతికి అలిసిపోయిన
పండు ముసలి ఒగ్గు కొలుకుల్లో
గోరువెచ్చని కన్నీరు.

అంతగా కన్నీరు
ఎంతగా గుండె
కరిగిపోయిందో
పెరిగిపోయిందో.

ఈ బొట్టు పడితే
ఆ నేల పండదు
ఉండదు.

# ఇదెక్కడి శక్తి?

మట్టితో ఇటుకతో రాళ్ళతో
గోడలు నిజమే ?
నీటిగోడ
నిజమా !
అంతెత్తు, అంత పొడుగు
నీటిగోడ నిజమా ?

మనుషులు సరే
కావాలంటే
పశువులు పక్షులు
నడుస్తాయి ?
నీటిగోడ నడుస్తుందా ?
భూమిని పూడుస్తుందా ?

గాలీ నీరూ మనిషికి
ప్రాణం పోస్తాయి
తిండి పెడతాయి.
మరివాళ ఏమయింది ?
ప్రాణం తీశాయి
పంచుకు తిన్నాయి.

ఇంతకాలం
నేలకు పొలిమేరగా ఉన్న సముద్రం
ఇవాళ పోలేరమ్మగా
ఎందుకు మారటం ?

శవాల్ని మట్టిలో పూడుస్తారు
కట్టెల్లో కాలుస్తారు

మనిషిని నీళ్ళలో పూడుస్తారా ?
కాలుస్తారా ?
ఇదేం జలసమాధి ?

ఎవరయినా
మెడబట్టి నెట్టొచ్చు
కొరడాలతో కొట్టొచ్చు
నీరు తోస్తుందా ?
మనిషి గొంతుకోస్తుందా ?

ఎప్పుడయినా ఉప్పెన,
ఉప్పునీటి ఊపు
ఇప్పుడో, నిప్పునీటి ఉరవడి!

కురుక్షేత్రంలో లంకలో
ఎక్కడయినా ఒక్కరోజు
పాతికవేల ప్రాణాలు పోయాయా ?
ఈ నేలకు
ఇదేం పరాభవం ?

అలకత్తితో
నేల తల తరిగిన
రాక్షస హస్తానికి
శిక్షేమిటి ?

ఇళ్ళ కప్పులు
గాలి పటాలైతే
దారాల్లాగేది
ఏ అదృశ్య హస్తం ?

పల్లెంతా
పడవై పోతుంటే

చుక్కానీలేదు
దిక్కూలేదు.

పశువుల ప్రాణాలు
అలలకు ఆయువుపోస్తే
పడిపోయిన ఈ కట్టెలు
ఏ అగ్నికి సమిధలు ?

మనిషి బ్రతికి పోవటానికి
పోయిన మనుష్యుల శవాలు
మెట్లు ?
రోడ్లు ?

ఎదిగిన బిడ్డలాగా
చేతికొచ్చిన పొలం
ఎడారి ఇసుకయితే
ఎవరినోటి దుమ్ము ?

వేలఏళ్ళ
మనిషి నాగరికతా ఆకాసౌధం
ఒక్క అల !
ఒక్క నిమిషం !
ఇంత శూన్యం !

నీరంటే వణికేమనిషి
ఇవాళ కదలని నీటి జంతువు
నీటిని వణికించే గజ ఈతగాడు
ఇవాళ అల వదిలేసిన నవ్వు

బ్రతికినంతకాలం
నిండని దరిద్రుడి కడుపు

ఇవాళ నీళ్ళతో నిండింది
ఆకలిలా ఉబ్బింది.

వీథిలో తిరిగే కుక్క
కట్టుగొయ్యనుండే ఎద్దు
మేడలో సుఖించే మనిషి
ఇవాళ ముళ్ళకంపలో రొచ్చులో
నిర్జీవ స్నేహం !

ప్రాణంపోతే
మనిషెంత వికారం !
ఎంత దుర్గంధం !
ఎంత అనవసరం !

శవాన్ని పూడ్చినా కాల్చినా మోసినా
పోసి తాకినా
ఎంత పుణ్యం ?
మరి ఈ శవపుణ్యం ఎవరికీవద్దా ?

కుక్క విశ్వాసం గల జంతువు
గుర్తు తెలియని యజమాని శవం
కంపు కొట్టకుండా
కాపాడుతూ వుంది
ఈ రక్షణ సహించాల్సిందేనా ?
మనిషి ఈ శిక్ష భరించాల్సిందేనా ?

ఏ వూరికైనా
వల్లకాడు
కొన్ని ఎకరాలే !
సముద్ర శ్మశానం
ఇన్ని మైళ్లు !

నిన్నటి దాకా
భార్యాభర్త
అన్నాతమ్ముడు
అక్కాచెల్లెలు
ఇంతలోనే
ఎవరికీ ఏమీ కానివాళ్లు !
ఎవరూ లేనివాళ్లు !

అల వలలో మనిషి
రెక్కలాడని చేప
భూమ్మీద నూకల్లేని
దిక్కులేని పక్షి.

ప్రకృతి ఆగడానికి
హద్దుల్లేవా ? అదుపుల్లేవా ?

ఇంత నాగరికత
ఇంత సంస్కృతి
ఏం చేయను ? ఏం కాను ?

ఒక అల తలెత్తితే
ఇన్ని తలలు నేలకూలటం
ఒక అల వలవేస్తే
ఇంత భూమి దొరికిపోవటం
ఇదెక్కడి ధర్మం ?

ఒక ఊళ్ళో వాళ్ళు
ఇంటిలో వాళ్ళు
అన్నం తింటున్న వాళ్ళు
చేయిచేయి పట్టుకొన్నవాళ్ళు
నిమిషంలో

ఎవరికెవరూ ఏమీ కారు.
ఇదేం న్యాయం ?

పండించే నీళ్ళు
పంట పూడ్చటం
దప్పితీర్చే నీళ్ళు
ప్రాణం తీయటం
మేరమీరని నీళ్ళు
దారి తప్పటం
ఒడ్డెక్కని నీళ్ళు
ఇళ్ళెక్కటం
ఇదేం పని ?

నిన్న నేలను
మింగిన నీళ్ళు
ఇవాళ కళ్ళను
చీల్చిన నీళ్ళు.

నిన్న ఏమీ ఎరగని సముద్రం
ఇవాళ ఏమీ తెలియనట్లేవుంది
కడుపులో ఎన్ని శవాలో !
ఎముకల గూడులో !

ఏ శవం కోసం
ఏ తల్లి తిరుగుతూవుందో !
ఏ శవం కోసం
ఏ చెల్లి అడుగుతూవుందో !
ఏ ఎముక కోసం
ఏ ఎముక రోదపెడుతూవుందో
దొర్లుతూ వుందో
ఘోషిస్తూవుందో

# 77

సముద్రానికేం తెలుసు ?
సైతానుకేం తెలుసు ?

ఈ తుఫాను
ఎవరి పాపం ?
ఈ వరద
ఎవరి శాపం ?

మనిషి సాధించిన అభ్యుదయం
మట్టిలో కలవరాదు
మళ్ళీ జలప్రళయం రారాదు.

మనిషికోరే భవితవ్యం
నీళ్ళుగారి పోరాదు
నీళ్ళపాలు కారాదు.

ప్రకృతిని జయించే మనిషి
పరాభవం పొందరాదు.
భవిష్యత్తును శాసించే మనిషి
ప్రకృతికి ఓడిపోరాదు.

మనిషి చరిత్ర అంతా
ప్రకృతితో పోరాటం
తుది విజయం
మనిషీ ! నీ యిష్టం !

# గుప్పెడు మట్టి

మనిషి నీళ్ళలో నిప్పు పుట్టించాడు
రాళ్ళలో రత్నాలు తీశాడు.

మంచు పర్వతంమీద కాలిముద్ర వేశాడు
చంద్రబింబంమీద రాకెట్టు పువ్వించాడు.

లాబొరేటరీలో విశ్వాన్ని ప్రసవించాడు
టెస్ట్ ట్యూబ్ బేబీగా పెరిగాడు

ఇప్పుడు ఏమయ్యాడు?
గుప్పెడు మట్టి !

# చెయ్యకేం చేస్తారు ?

సైనికులు కవాతు చేస్తున్నారు.
చెయ్యకేం చేస్తారు ?

సైనికుడికి తుపాకి ప్రేయసి
బుల్లెట్లు బిడ్డలు ప్రాణం హారతికర్పూరం.

అతడిమెడ దేశప్రతిష్ఠలా వాలదు
జాతి జెండాలా వొరగదు

సైనికుడికి పట్టుదల ఆహారం, ఓర్పు కవచం,
ప్రయత్నం ఊపిరి, పోరాటం జీవితం.

దేశ గౌరవం తుపాకికంటిలో పెట్టి
ప్రేమ గుండెను ఎడారుల్లో అడవుల్లో
కొండల్లో దాచి వుంచాడు.

సైనికుడు రిటైరైతే,
అనుభవాల చుట్టకాల్చుకొనే
గుడ్డి, కుంటి, అవిటి, చెవిడి వాడు
బిచ్చగాడు పిచ్చివాడు
తాగుబోతు తిరుగుబోతు
అసమర్థుడు అప్రయోజకుడు.

సైనికుడు మరణిస్తే,
ఇక్కడ త్రివర్ణ పతాకంతో
గన్ శాల్యూట్‌తో సంస్కారం
అక్కడ కాలవగట్టునో

చెట్టు నీడనో
కొండ పక్కనో భూసమాధి.
ఎక్కడో జలసమాధి
వాయుసమాధి.

మరణించిన సైనికుడి భార్య
చేని గనిమ మీద సర్వేరాయిలా
గుడిసెలో శీలం విరిగిన తడికెలా
నగరం వెన్ను రాచపుండులో ఆకలి పురుగులా
మురికి వీధి నిప్పుబొట్టు నుదురుకాల్చే చీడలా వుంది.

గతించిన సైనికుడి కూతురు
తాతనీడకు బరువైన గుదిబండగా
కలవాళ్ళ అంట్లుకు మురికి పామే చీదరగా
ఆనకట్ట లేని కన్నీటి వరదగా
వైశ్యాగృహం పక్కకు కాలం తోలే గాలిగా అయింది.

చచ్చిన సైనికుడి కొడుకు
హోస్టల్లో ఆఆలు ఏరి పారేసి అన్నం తింటున్నాడు.
జనం జేబులకు బ్లేళ్ళతో పాఠాలు చెబుతున్నాడు.
ఊళ్ళో వాళ్ళ గొంతుల్లో ఊపిరిరూపం పరికిస్తున్నాడు.
జాతి నీతిని మత్తుమందులో రవాణా చేస్తున్నాడు.

సైనికులు కవాతు చేస్తున్నారు !
చెయ్యకేం చేస్తారు ?

# నిప్పు రవ్వ

నువ్వు ఎవరెస్టు శిఖరం ఎక్కినా
ఎల్లోరా గుహల్లో నక్కినా
లోకం నీ కులం తెలిసిందాకా
నిద్రపోదు.

ఈ నిప్పురవ్వ
ఆరదు మారదు
దాగదు ఆగదు.

ఇది వామిలో పడితే బూడిద
పొయిలో పడితే కూడు
దహిస్తుందో వెలిగిస్తుందో
అది నీ అదృష్టం, నీ జాతకం.
కులం ఒకడికి వరం
మరొకడికి శాపం
అది నీకు పగలంత నికరం
నాకు రాత్రంత కచ్చితం.

మర్చిపోకు
మనం అన్నదమ్ములం
కాలం కన్న పిల్లలం.

# ఇదేం కొత్తకాదు

కరెంటు లేని ఫేన్‌గది ఉక్కలో ఉండలేని పసిపిల్లలా
చక్కెర క్యూలోని సంసారి తాగిన చెరుకురసంలా
ఒకే లైను మీద ఆగకుండా తిరిగే గ్రాంఫోనురికార్డులా
పూల బరువుతో తలవంపులైన పెళ్ళికూతురులా
అభినవమన్మథుడి బ్రాందీ గ్లాసులో స్నానం చేసిన ఈగలా
వచ్చింది ఉగాది

మీద పడే కుక్కనేమీ చేయలేని అతిథిలా
తెగిన చెప్పును పారేయలేక మోసే దానిసొంతదారులా
లెఫ్టిస్టో రైటిస్టో తెలపని తాగిన లారీలా
రోడ్డున పడ్డ సమ్మెలా, నిద్రలేని కన్నులా
అయింది ఉగాది

మామిడి సొగసుకత్తె
చిగురుకంటితో సైగచేస్తే
ఇదేం పాత విట కోకిలా పరుగెత్తుకు రావటానికి
పారిపోయింది.

పదహారు పళ్ళూ ప్రేమతో పిలిస్తే
ఇదేం మునుపటి చెరుకుగడా
రసం తేవటానికి
బిగిసిపోయింది.

పెట్రోలు లేకపోయినా యంత్రాలు ఆడటం
చెక్కెర లేకపోయినా కాఫీ దొరకటం
నీళ్ళు లేకపోయినా చెట్లు చిగర్చటం
కూడు లేకపోయినా పిల్లలు పుట్టటం-ఉగాది మాహాత్మ్యం

రాదనుకొన్న తుఫానువచ్చి రాద్ధాంతం చేసినట్లుగా
స్కైలాబ్ పడుతుందనుకొని పడ్డపాట్లుగా
జరిగే నమ్మకంలేని ఎన్నికలు దుమ్ము రేగ్గొట్టినట్లుగా
కళ్లు పోవలసిన సూర్యగ్రహణానికి కళ్లు వచ్చినట్లుగా
ఉంది ఉగాది.

పరీక్ష ఫీజు కట్టలేని విద్యార్థిలా
కట్నండబ్బు కూడబెట్టలేని ఆడపిల్ల తండ్రిలా
వయస్సు పొంగులు ఆపుకోలేని యువకుల్లా
నెలతప్పే యువతుల్లా
పూలబాణాలతో పసిప్రాణాలు తీయలేని
నూతన మన్మథుళ్ళా
తప్పుకొంది ఉగాది.

ఎప్పుడో భగవంతుడు పుట్టకపూర్వం
సూర్యుడి మొట్టమొదటి కౌగిలింతకు
భూమి నర్తిస్తూ
నగ్నంగా వర్తిస్తూ
ఆనంద పారవశ్యంలో చేసిన కలధ్వనికి
ప్రతిధ్వని ఈ ఉగాది.

ఇన్నేళ్ళయినా
నడకలో వాడుపు సడలని వృద్ధపృథ్వి
పెట్టుకొన్న నుదుటిబొట్టు సూర్యబింబం.
ఈ ఉగాది నాడు కూడా
ఆ పాత సూర్యుడే ఉదయించాడు.

సిద్ధాంతి పంచాంగంలోని భవిష్యత్సుఖం తెలిసే
అక్షరాల బఠానీలు
ఒక్కొక్కటే ఏరుకుతింటున్నాడు.

ఇక నెలకు నాలుగు వానలు కురుస్తాయో లేవోకాని
ధర్మం పదిళ్ళమీదే నడుస్తుంది.

ఏడాది పొడుగునా ఏం జరిగినా
అన్నింటికీ ఇదే మూలం
ఈ ఉగాది ఇలా ఉండటానికి
ఉల్లిపాయరేటే కారణం.

కాలగర్భంలోని రౌద్రి ప్రభవిస్తుందని
ఆకాశం అంచు ఏనాడో ప్రకటించింది.
అవని నయనాంచలక్షితిజరేఖా నిశ్శబ్దం
ప్రశాంతంగా అంగీకరించింది.

ఇదేం కొత్తకాదు.
సృష్టిలో కొత్తపుట్టుకలా వచ్చి
మృత్యువులా పోయే
ఇదేం కొత్త కాదు.
విశ్వం ఊపిరి పీలిస్తే రౌద్రి వచ్చింది.
వదిలితే పోతుంది.
ఏ ఏడయినా ఒక విశ్వ శ్వాస.

# ఇంకానా ?

లారీ తోలేవాడు
రిక్షా తొక్కేవాడికి
పల్టీ కొట్టటం నేర్పి
భద్రంగా వెళిపోయాడు.

కారు నడిపేవాడు
కాలి నడక వాడికి
పిల్లి మొగ్గ వేయటం చెప్పి
బే ఫర్వాగా సాగిపోయాడు.

రైల్లో పోయేవాడు
ప్లాటుఫారం మీది వాడికి
వీపు మద్దెల మోత రుచి చూపి
టాటా చెప్పి వెళ్ళాడు.

బస్సులో వెళ్ళేవాడు
బాటన పోయేవాడికి
నడ్డి నాట్యం చేయించి
నాజూకుగా నవ్వి సాగాడు.

ఇదా ?
ఇదింతే !
ఇంకానా ?
ఇంకేమన్నా వుందా ?

ఆఫీసరు గుమాస్తాని
ఛీఛీ థూథూ అని

కోప్పడ్డాడు
గుమాస్తా గోళ్ళు గిల్లుకొన్నాడు.

గుమాస్తా ప్యూన్‌ని
నాన్‌సెన్స్ గీన్‌సెన్స్ అని
ఎగిరిపడ్డాడు
ప్యూను నోరు నొక్కుకొన్నాడు.

ప్యూను భార్యని
బుద్ధిలేదు బొందలేదు అని
రుసరుసలాడాడు
భార్య నోరెత్తలేదు.

భార్య పెద్దబాబుని
'పీడాకడు తగలాటకం' అని
చెడామడా చరిచింది
'అమ్మో' అంటూ ఏడ్చాడు.

పెద్దవాడు ఉయ్యాలలోని
చిన్నవాణ్ణి తోలు లేచేటట్టు
గట్టిగా గిల్లాడు.
మాటరాక, నోరులేక
కారణం తెలియక
ఆకాశం చూస్తూ వాడు
ఆవురుమని ఏడ్చాడు.

ఇదా ?
ఇదింతే !
ఇంకనా ?
ఇంకేమన్నా వుందా ?

రైల్ స్టేషన్‌లో
బిచ్చగాడి తలకింది బట్టల మూట
పేంట్ వేసుకొన్నవాడు
[illegible] లాక్కొని
చీకట్లోకి పోయాడు.

ప్లాటుఫారం మీద
అడుక్కొనేవాడి పైకందువా
రైల్లో పోయేవాడు
గుంజుకొని
వెళ్ళిపోయాడు.

బస్ స్టాండులో
నిద్రపోయేవాడి దుప్పటి
సినిమాచూసి వస్తున్న వాడు
పీక్కొని
తీసుకుపోయాడు.

సత్రంలో
పడుకొన్నవాడి గోచి
లేచినవాడు
తీసి
పెట్టుకుపోయాడు.

ఇదా ?
ఇదింతే !
ఇంకానా ?
ఇంకేమన్నావుందా ?

దొంగ,
కూలి విప్పుకొన్న చద్దిమూట

గుంజుకొని,
పోయిందే పోవటం !

కూలి,
బిచ్చగాడు కలుపుకొంటున్న నాలుగిళ్ళ కూడు
పీక్కొని
పరుగో పరుగు !

బిచ్చగాడు,
పసివాడు ఎత్తుకొన్న ఎంగిలి విస్తళ్ళ ముద్ద
లాక్కొని
కంటికగ్గనిపిస్తే ఒట్టు !

పసివాడు
కుక్క నాకుతున్న పులిస్తరాకు
తీసుకొని
వేలితో తుడుచుకొని —

ఇదా ?
ఇదింతే !
ఇంకానా ?

# దగ్ధశిల

ప్రేమిస్తే గుండె
పండుతుంది
ద్వేషిస్తే
మండుతుంది.

పంట కావాలో
మంట లేవాలో
అది నీ యిష్టం
నీ లోకమిష్టం.

నా మట్టుకు నాకు
ప్రేమ ఎందుకొమ్మ
పగ అగ్గిపెట్టె

నువ్వున్నంతకాలం
పెట్టె వెలగదు
కట్టె కాలదు.

నువ్వు కనుమరుగైతే
చీకటి !
చుక్కలు రవ్వలు
ఉషోదయం మంట
లోకం దగ్ధశిల.

# ఎంత బాగుంటుందీ ఏం కత !

పసివాళ్ళు పుట్టిందగ్గర్నుంచి
ముసలాళ్ళు చచ్చిందాకా వుండే
ఏ విషయం మీదైనా
ఎడా పెడా పద్యాలు వాయించే నేర్పుకొద్దీ
నేను నమ్మని విషయాన్ని
మిమ్మల్ని నమ్మమని చెబుతూ వుంటే
మీరు నమ్ముతాం(వంటుంటే
ఎంత బాగుంటుంది ఏం కత !

పదహారేళ్ళు భర్త కాకముందే
భర్త అయిపోయే వాడికి
మారో ఏటికి మగతనానికి
నిదర్శనంగా
తండ్రి అయ్యేవాడికి
లక్ష్యం లేనివాడికి
ఖాతరు లేని కేరేర్ఝూట్‌గాడికి
ఎవడో నెత్తిన్నోరుపెట్టి
కొట్టుకొంటూ వుంటే
ఎంతబాగుంటుందీ ఏం కత !

పంచేంద్రియాలను భగవంతుడిచ్చాడు
ఆనందాన్ని ఆడవాళ్ళను ఆయనే ఇచ్చాడు
అంచేత
ఓపినంతగా తిని ఓపికున్నంతగా కని
దేశంలో జనాభా పెంచుతూ వుంటే
ఎంత బాగుంటుంది ఏం కత !

మధ్య తరగతి మనుష్యులికి
ఇద్దరో ముగ్గురో పుడితే
ఇక నోరూ వాయీ లేదు
మాటా పలుకూ లేదు.

పై తరగతి జనం కదేం తత్త్వమో
పిల్లా జెల్లా పుట్టనే పుట్టరు
పుడితే ఒకటీ అరా.

క్రింది తరగతి మహాత్ములున్నారే, వీళ్ళకి
భగవంతుడు దగ్గర్నుంచీ, ప్రభుత్వందాకా
ఎవరన్నా లెక్కా డొక్కా లేదు
వాళ్ళకి రాకెట్టు స్పీడులో
రవందాడిగా పిల్లలు.

ఈ దరిద్ర నారాయణుల సంతతి
దేశమంతా సరఫరా అయితే

ఏం కావాలి,
మన దేశ సంస్కృతి ఏం కావాలి ?
ఈ మహోన్నత నాగరకత ఏమై పోవాలి ?

అంచేత
ఈ క్రింది వాళ్ళకు అవకాశం ఇవ్వక
పైనో మధ్యో ఉన్న మనమే
ఏమయితే అదే అయిందని, కళ్ళుమూసుకొని
ముప్పతిప్పలు పడి మూడు చెరువుల నీళ్ళు తాగి
యథాశక్తి పిల్లల్ని కంటే
వాళ్ళు దేశం నిండా పెరుగుతూ వుంటే
చీమలపుట్టల్లాగా నేల ఈనినట్లుగా

మన పిల్లలుంటే
ఎంత బాగుంటుందీ ఏంకత !

తెలివున్న మనిషికి
తెలివున్న పిల్లలు పుడతారు
తెలివిలేని మనిషికి
తెలివిలేని పిల్లలు పుడతారు.

అనుమానం లేదు
విత్తనం ఒకటి వేస్తే చెట్టొకటి మొలవదు.

తెలివున్న వాడు
పిల్లలెక్కువ వద్దనుకొంటాడు.
తెలివిలేనివాడు
పిల్లలెక్కువ కావాలనుకుంటాడు.

పాపం వాళ్ళకోర్కెలు
భగవంతుడు తీరుస్తాడు.

ఇక చూడండి
భారతీయ భవితవ్యం.

దేశం నిండా తెలివి లేనివాళ్ళు
మూర్ఖులైనవాళ్లు
చచ్చుదద్దమ్మలు చెలామణి అవుతారు.

...బట్టి వీల్లేదు
తెలివున్న వాళ్లూరోకటానికి వీల్లేదు.

నాల్సిందే !

...ల్లల్ని కనాల్సిందే !
...న తెలివి తెల్లవారిందాకా
...న బుద్ధుల్లాంటి పిల్లల వెర్రి ముఖాలు

## 93

మన మూర్ఖత్వంలాంటి వాళ్ళ అరుపులు వింటుంటే
ఎంత బాగుంటుంది ఏం కత !

ఒక కులం వాడి
ఒక మతం వాడి
పిల్లలు పుట్టీ పెరిగి
మరో కులం వాడి
మరో మతం వాడి
పిల్లలు పుట్టకా పెరక్కాపోతే

ఏమయ్యేట్టు ?
దేశం ఏమయ్యేట్టు ?
అభ్యుదయ మానవ భవిష్యత్తు ఏమయ్యేట్టు ?
దేశం ఎటు పోయేట్టు ?

అంచేత

పిల్లల్ని కడుపారా కంటే
వాళ్ళ ఆకలి రొదలు హాయిగా వింటే
మనం సుఖంగా వుంటే
ఎంత బాగుంటుంది ఏం కత !

యౌవనం కామధేనువు
కాదంటే కల్పవృక్షం
లేదంటే ఏదో పిచ్చిమొక్క
పూస్తుంది కాస్తుంది.

పూవు తుంచడం భ్రూణహత్య
కాయ కోయడం నరహత్య
సంతానం దేవుడిచ్చిన వరం
దాన్ని తిరస్కరించటం అపచారం.

అంచేత
పిల్లల్ని కందాం
చెడామడా ఎడాపెడా హడావుడిగా కందాం

అప్పుడు
అన్నం చాలక తగ్గించుకొని
బట్ట చాలక తగ్గించుకొని
ఇల్లు చాలక తగ్గించుకొని
వాకిలి చాలక తగ్గించుకొని
తగ్గి తగ్గి భూమిలోకి పోతూ వుంటే
ఎంత బాగుంటుంది ఏం కత !

మన ఆడవాళ్ళు
మహా మంచి వాళ్ళు
మన ఆడవాళ్ళు
దాన ధర్మాలకు ఆనవాళ్ళు

అడిగితే కాదనని జవరాళ్ళు
గీసిన గీత దాటని గిరిరాళ్ళు
చెప్పినట్లు వింటారు
చేయమన్నట్లు చేస్తారు.

అంచేత
పిల్లల్ని కనమందాం
ఏం ఫరవాలేదు వాళ్ళు కనేస్తారు.

ఇక చూడండి
క్షణక్షణానికి పిల్లలు దిగుమతి అవుతూవుంటే

కోడి పిల్లల్లాగా
కుక్క పిల్లల్లాగా

పంది పిల్లల్లాగా
ఎక్కడ చూసినా మన పిల్లలే.

లక్షోపలక్షలుగా
తండోపతండాలుగా
గుంపూపగుంపులుగా
ఎక్కడ చూసినా మన పిల్లలే.

ఊచ కాళ్ళతో
ఉబ్బు కడుపుతో
కళ్ళు లేక
కాళ్ళు లేక
తిండిలేక బట్టలేక
బ్రతకలేక ఊపిరిలేక
ఎక్కడ చూసినా మన పిల్లలే వుంటే
ఎంత బాగుంటుందీ ఏం కత!

పిల్లల్ని కనొద్దనడం
వొంటి కెంత ముప్పు ?
ఇటువంటి మాటలు
అనరాదు వినరాదు !

అంచేత
దేశమంతా పిల్లలు పుట్టాల్సిందే
రెండు వేల పాతికో ఏటికి
మన పిల్లలు మూడు పూలారుకాయలై
నూటయాభై కోట్లయితే

కలకత్తా మహానగరం
ఏభై కోట్ల జనంతో
మహా మహా మహా నగరం అయిపోతే

ఎన్ని హత్యల ఆనందాలు
ఎన్ని పరాభవాల పరమార్థాలు
ఎన్ని మానభంగాల మాహాత్మ్యాలు
ఎన్ని సుందర స్వప్నాల గందరగోళాలు
సుఖంగా జరిగిపోతూ వుంటే
ఎంత బాగుంటుందీ ఏం కత !

జనం పెరిగి, నేల పెరక్క
అవసరాలు పెరిగి, అవకాశాలు పెరక్క
బ్రతకటానికి వీలులేక, చచ్చిపోతే
చచ్చినవాళ్ళని పాతేయడానికి
కాల్చేయటానికి
జ్ఞాపకచిహ్నాలు
శిలాఫలకాలు
ఎత్తించటానికి
కాశీ లేనంతగా
గొలుసుకట్టుగా
బ్రతికివున్న జనం
బరాబరులు తీర్చివుంటే
ఎంత బాగుంటుందీ ఏం కత !

హాయిగా పుట్టి
మరీ హాయిగా పెరిగిపోయిన జనం
ఉండటానికి ఇల్లులేక
తినటానికి తిండిలేక
కట్ట బట్టలేక
అన్నీ సమస్యలై
(అన్నమో మహాప్రభూ) అని
గంగానదీ పాత్ర పట్టుకొని
అప్పులు తెచ్చుకొంటే

అడుక్కుతింటే
అడుక్కువుంటే
అడుక్కు బట్టకట్టి బ్రతికివుంటే
ఎంత బాగుంటుందీ ఏం కత !

అప్పిచ్చినవాడు గొంతుమీద కూర్చుంటే
ఇస్తావా చస్తావా అంటే
ఎదురు తిరిగి ఎగకొట్టలేక
పొలంపుట్రా నగానట్రా
ఆయకం పెట్టటమో
అమ్మేయటమో చేసినట్లే
దేశాన్ని, మన దేశాన్ని
మన స్వతంత్ర భారతదేశాన్ని
చచ్చిచెడి సంపాదించుకొన్న
స్వతంత్ర భారత దేశాన్ని
ఆయకం పెట్టుకొంటే, అమ్మేసుకొంటే
ఎంత బాగుంటుందీ ఏం కత !

ఒక్క మతం కాని ఈ జాతి
ఒక్క భాష కాని ఈ జాతి
ఒక్కరాష్ట్రం కాని ఈ జాతి
నదుల్ని మధ్యకు కోసే ఈ జాతి
సరిహద్దుల్ని సరాసరి చీల్చే ఈ జాతి
లక్షలాది సమస్యలతో చస్తున్నప్పుడు
జనం పెరిగి
క్రొత్త సమస్యలు సుఖంగా పెరిగి
చీలికలు దివ్యంగా పెరిగి

కలహాలు కమనీయంగా పెరిగి
అంతఃకలహాలు ఆనందంగా ఎదిగి

ఆత్మ రక్షణ లేక
దేశ రక్షణ లేక
అంతర బాహిర హింసల, యుద్ధాలతో
సరిహద్దులు సంచలిస్తే
ఎవరెట్టు జవజవలాడితే
ఎంత బాగుంటుంది ఏం కత !

దేశం, అప్పిచ్చిన వాడికో
ఆయుధ బలానికో
అమ్ముడుపోతేనో
హస్తగతమయితేనో
మళ్ళీ పరాయి పాలనలో
మునుపు చచ్చిన చావులో
మనం చావటానికి సిద్ధమయినా
ఈ మధ్యనే స్వేచ్ఛావాయువులు
పీల్చిన మన పిల్లలు
సౌఖ్యవలయంలో
ఉయ్యాల లూగిన మన బంగారు పసిపిల్లలు
మన ఆనందాలకు సంకేతాలుగా
ఆవిర్భవించిన
కసుగందని పసికందులు
మన ఆత్మలకు ప్రతీకలుగా
భవిష్యత్తును శాసించే
సుకుమారులు నవధీరులు
కూలీలుగా, శ్రామికులుగా, బానిసలుగా
తన్నే తన్నులు తింటూ, కాళ్ళు వత్తుతూ
తిట్టే తిట్లు తింటూ, తిండి పెడుతూ
ఎంగిలి కూడు తింటూ
బ్రతకలేక చస్తూ
చావలేక బ్రతుకుతూ
పతనోన్ముఖ దరిద్ర దుష్ట వ్యవస్థ చూస్తుంటే
ఎంత బాగుంటుంది ఏం కత !

# ఈ ఉగాది

హరిజనులు గిరిజనులు
బలహీనులు సామాన్యులు
వెనుకబడిన తరగతుల వాళ్ళు
ఐక్యంగా మౌనంగా విజయవంతంగా
ఆడిన రాజకీయ చదరంగం ఈ ఉగాది.

కాలం బాలుడు ప్రకృతి కాగితం మీద
రంగు పెన్సిల్‌తో గీసిన వయ్యారమైన గీత.

ఆరవై పేజీల నోట్ బుక్‌లో
ఇది సరికొత్త పుట.

ఇది బీదవాడికి చెదలు తిన్న పుస్తకం.
ఉన్న వాడికి కాలికోబైండు గ్రంథం.

చెప్పుకోలేని బాల్యంలోని ఉగాది ఊసులు
కన్నీరై ఘనీభవించి, మంచుగడ్డలై
ఆవిర్లు చిమ్ముతూ, పొగమంచై చూపుకు
చేదురుచి చూపుతున్నాయి.

# కారడవి కాగడా

ఈ రోజు నిన్నటిది కాదు
ఇది మునుపెప్పుడూ రాలేదు.

ఈ రోజు
చరిత్ర లతమీద పూసిన
ఒకే ఒక్క పూవు.
మానవ సహకారం మీద కాసిన
ఒకే ఒక్క కాయ.

నేటి మనిషి నుదుటి పొలంలో
పుష్పించిన కల్పవృక్షాలు
మునుపెన్నడూ మొలకెత్తలేదు
పిలకెయ్యలేదు.

బూజు పట్టిన ప్రకృతి దీపం
కొడిగట్టిన చరిత్ర వొత్తి
ఇనాళ మనిషి వెలిగిస్తున్నాడు.
వేల ఏళ్ళ కాలం
వేసిన ముతక సంప్రదాయాల సంకెళ్ళు
వందలేళ్ళ నాగరక జీవితం
వడ్డించిన ముడి ఆచారాల బండరాళ్ళు
ఛేదిస్తూ తొలగిస్తూ
ఇవాళ మనిషి విజృంభిస్తున్నాడు.

మనిషికీ మనిషికీ మధ్య
మహారణ్యాలుగా పెరిగిపోయిన
విభేదాలు విద్వేషాలు
ఇవాళ మనిషి దహిస్తున్నాడు.

ఊరికీ పల్లెకూ మధ్య
వంకర గీతలు గీసిన
కుళ్ళు వ్యవస్థలు కుచ్చిత బుద్ధులు
ఇవాళ మనిషి మొదలంట నరుకుతున్నాడు.

అందువల్ల
బ్రహ్మతల లాంటి చిటారుకొమ్మన పూసినపూవు
కొమ్మల్ని రెమ్మల్ని చెట్టు చేమల్ని కాదని
కాండాన్ని కాలరాచి
వేళ్ళను తూలనాడి
పరిహసించి పరాభవించే
వ్యవస్థ వెన్నెముక విరుగుతూ వుంది.

మానవత్వం ముఖాన తలుపేసి
సభ్యతను సంస్కృతిని బంధించిన
మిథ్యా నాగరికతా భవనం
పునాదులు కదులుతున్నాయి.

చరిత్ర కొట్టిన కారం మంటతో
కళ్లు నులుపుకొంటూ
సమాజ కారాగారంలో
కుములుతూ
తన చుట్టున్న చీకటిగదులు తప్ప చూళ్ళేని
చిన్నబుద్ధుల్లో సన్నకళ్ళల్లో
ఆలోచనాసూర్యుడు
ఉదయిస్తున్నాడు.

ఇంకపైన
ప్రతిమనిషి గుండె దీపం
ఒక్కొక్క సూర్యుళ్ళా వెలిగి,
ప్రతి ప్రాణి ఊపిరి తేజం

చల్లని గాలి రివటలా వీచి,
ప్రతిజీవి రక్తభావి
సుధావారిధిలా ప్రవహించి,
ప్రతిమూర్తి శరీరదీప్తి
పృథివిలా క్షమాశీలమై నిలిచి,
ప్రతి వ్యక్తి మనశ్శక్తి
వియత్తంలా విశాలమై వెలసి,
పాంచ భౌతిక ప్రకృతిలో
మానవ ప్రకృతిలో
ఈ రోజు మేలుకొలుపు.

అడవిలోనుంచి నగరానికీ,
బానిసతనంనుంచి స్వేచ్ఛకూ,
ఎదిగిన మనిషి ఉన్నతికి
ఈ రోజు కర్మసాక్షి.

తిండికోసం ప్రాణులు
తన్నుకులాడిన సంఘంలో
మనిషికి కండే బలం.

కులం నల్లమందు మింగి
మత్తెక్కిన వ్యవస్థలో
మతమే బలం.

వీథిలో ప్రేమ అభిమానం విశ్వాసం
విచ్చలవిడిగా అమ్మే సమాజంలో
డబ్బే బలం.

బుద్ధికీ గుండెకూ కళ్ళు
ఆ కళ్ళకు చూపు
ఉన్న నేటి మనిషికి ఆలోచనే బలం.

అవును మరి
ఇవాళ్ళి మనిషికి
దేవుడే మ్రొక్కుబురు ?

స్వతంత్రతను తింటూ
సమానతను తాగుతూ
స్వేచ్ఛ పీల్చే
నేటి మనిషి
వెన్నెముక నిలిచినంత నిటారుగా
మునుపున్న దనటానికి
మానవ చరిత్రలో దాఖలాలేదు?

సమాజ సాగరంలో
మును పెప్పుడూ లేని
ఆత్మ విశ్వాసపు పడవలో
ధైర్యం చుక్కాని పట్టుకొని
మనిషి తీరం చేరుతున్నాడు.

తరతరాల బానిసతనానికి స్వస్తిచెప్పి
సనుస్త వ్యవస్థల దాస్యానికి భరతవాక్యం పలికి
ఆధునిక నాగరక వంచనకు తిలోదకాలొదిలి
సామాన్యుడు జాతిజెండాలా
ఎత్తుగా ఉవ్వెత్తుగా
నిండుగా, గుండెలునిండగా, కోర్కెలు పండగా
జనగణశ్రేయం పాడుతున్నాడు.

మతం తాటాకులకు
భాషల అగ్గిపుల్లలంటించి
అంతఃకలహాల మంటలు రేపి
చలికాచుకొనే మనిషి
మూర్ఖతాశృంఖలాలు తెంచుకొని
భయాల మంచు మచ్చులు తుడుచుకొని
విదిలించుకొని
వళ్ళు విరుచుకొని
మూర్తిదాల్చిన చైతన్యంలాగా
కారడవి కాగడా లాగా
ఇవాళ సాగిపోతున్నాడు

# అభ్యుదయం

పైసా లేనివాడు
పైగా హరిజనుడు
ప్రధాన మంత్రి కాగలిగె
ఐదేళ్ళు ఉండి,
ఆ పైన వదిలి,
పైసా లేకుండా
పాత మనిషిగా
బ్రతగ్గలిగిన్నాడు
భారతదేశం
బాగుపడ్డట్టు !

# ఇంకా నయం

బిచ్చగాళ్ళా ? — లేరు !
బీదవాళ్ళా ? — లేరు !
అనాథులా ? — లేరు !
హరిజనులా ? — అసలే లేరు !
— ఇంకా నయం
— ఈ దేశం లేదన్నావు కావు !

దీనుడికి
నమ్మకం దేవుడుగా
విశ్వాసం ఆచారంగా
పట్టుదల సంప్రదాయంగా
బ్రతుకు కట్టుబాటుగా
కథలు చెప్పి, వ్యథలు విప్పి
నిలిచేవాణ్ణి, నిలిపేవాణ్ణి చేసి
మనిషికి మంచి చేయాలి !
మోసం-చేస్తూ నేవున్నాం !

అనాథుడికి
ఆదరణ శరీరంగా
ఆప్యాయత ఆత్మగా
ప్రేమ రక్తంగా
అనురాగం చైతన్యంగా నిలిపి,
మమతారూపంగా సమతాదీపంగా
ఉండేవాణ్ణి ఉంచేవాణ్ణి చేసి,
మనిషికి న్యాయం చేయాలి !
అన్యాయం—చేస్తూ నేవున్నాం !

బిచ్చగాడికి
రోడ్డుస్వర్గం తొలగించి
యాచనాగీతోపదేశం మానిపించి
నీతుల చిరుగు బొంత పారేయించి
కూర్చున్న కాళ్ళు నిలబెట్టి
కాలుసాగి చేయిసాగి
కదిలేవాణ్ణి కదిలించేవాణ్ణిచేసి
మనిషిని బ్రతకమని చెప్పాలి !
అబద్ధం—చెబుతూనే వున్నాం.

బీదవాడికి
బట్ట కవచంగా పొలం ఆయుధంగా
ఇల్లు వళ్ళుగా తిండి విశ్వాసంగా ఇచ్చి
బతికున్నవాణ్ణి బతుకిచ్చే చేసి
మనిషికి ధైర్యం పెంచాలి
పాపం—పెంచుతూనే వున్నాం !

హరిజనుడికి
అంటురోగం నయంచేసి,
ఆకలిపుండు బాగుచేసి,
ఏడుపు కడుపు మంట చల్లార్చి,
కులం గోతిని పూడ్చి,
తల నిలిచి గుండె మొలిచి
పెరిగేవాణ్ణి పెంచేవాణ్ణి చేసి
మనిషిని ప్రేమించాలి !
అధర్మం—ప్రేమిస్తూనే వున్నాం.

పొలంపసిపిల్లకు కాలవ తలనూనె ఇచ్చి
ఎరువుల చిరుతిళ్ళు పంపి,

పైరు వయస్సు పెంచి
యౌవనం నూర్పిడి చేసి
పంట పాతర వేసి
ఇంట వెన్నెల పోసి కర్షకుణ్ణి
తినేవాణ్ణి పెట్టేవాణ్ణి చేసి
మనిషికి మేలు చేయాలి
తప్పు—చేస్తూనేవున్నాం !

కార్మికుడికి
ఇంజను చేయి, ఇంధనం కాలు
విద్యుత్తు నరాలు, పరిశ్రమ ప్రాణం ఇచ్చి
ఉత్పత్తి గనులు తవ్వి
సంపద మణులు తీసి
నడిచేవాణ్ణి నడిపేవాణ్ణి చేసి
మనిషికి మేలు చేయాలి
పొరపాటు—చేస్తూనే వున్నాం !

బిచ్చగాళ్ళా ? - లేరు !
బీదవాళ్ళా ? - లేరు !
అనాథులా ? - లేరే !
హరిజనులా ? - అసలే లేరు !
-ఇంకా నయం
—ఈ దేశం లేదన్నావుకావు !

# ప్రేమిస్తున్నాను

భూషించినా దూషించినా
స్వాగతం పలికినా వీడ్కోలు చెప్పినా
సన్మానించినా అవమానించినా
నవ్వించిన ఏడ్పించినా
నా యీ దేశాన్ని ప్రేమిస్తున్నాను.

లక్షల నక్షత్రాల లెక్క తెలిసినట్లు
కోట్ల ఇసుక రేణువుల మొత్తం లభించినట్లు,
భూగోళానికి మా వూరే కేంద్రమయినట్లు,
మహాకవుల ప్రాణమంతా నేనే పీల్చినట్లు,
నా దేశాన్ని ప్రేమిస్తున్నాను.

మంచు పడ్డ చిల్లకంప మెరుపులా
తొలకరి వానచినుకును తిన్న దువ్వనేల బుసలా
వెన్నెల పొదరు కొట్టుకొన్న అవనిలా
వానలో తడిసిన గువ్వలా
చలికి దాక్కొన్న కోకిలలా
నా దేశాన్ని ప్రేమిస్తున్నాను.

చలివేంద్రంలోని నీళ్ళు, ఫ్రీజ్‌లోని మంచు రాళ్ళు
టాటా బిర్లా పర్సుచలి హాట్‌పులి వాటినెచ్చెలి
గుడిసె తాటాకు మీద బ్రహ్మరాత కొరుక్కతిన్న చెదలు
బ్రిడ్జిక్రింద గోనె పట్టాల పాక పెంచే దారాల మీసాలు
సాక్ష్యంగా నా దేశాన్ని ప్రేమిస్తున్నాను.

ఎండాకాలం తార్రోడ్డు చెప్పుల్లేని కాళ్ళ వేడి పరీక్షించినట్లు
ఖురదలోని ముళ్ళు కాళ్ళనెత్తురును పేరంటానికి పిలిచినట్లు

చలికోపం గోచిపాతలేని వంటిని పలకరించినట్లు
ఎండే చెరువు నెర్రెల్లో కప్పలు బెకబెకలాడినట్లు
నా దేశాన్ని ప్రేమిస్తున్నాను.

సాహిత్యం సంగీతం కళలు ఒక వర్గం పెట్టుబళ్ళనీ
దేవుళ్ళు దేవాలయాలు పూజారులు ఒక జాతి ఆస్తులనీ
రాజకీయం నాగరికత సంస్కృతి దిష్టిబొమ్మలనీ
ప్రాచీనత, ప్రశస్తి, వైభవం అసలు బూతులని
తెలిసి నా దేశాన్ని ప్రేమిస్తున్నాను.

భూమి గుండె నాన్న తెస్తే అమ్మ పెడితే తిని
సాలీడు కుట్టిన చొక్కా అన్న తెస్తే అక్క ఇస్తే వేసుకొని
పెళ్ళాం పిల్లల కన్నీళ్ళు కషాయంగా తాగి
బంధువుల ఓదార్పు వడగళ్ళు మిత్రుల కబుర్ల
బతాసీలు నమిలి
నా దేశాన్ని ప్రేమిస్తున్నాను

నా, నీ, మన వాళ్ళను
అవసరమై తిట్టినా అనునయించినట్లే
ఋతువుల్ని రుచుల్ని రుక్కుల్ని ఋషుల్ని
సమయంపడి చీదరించినా ఆదరించినట్లే
నా దేశాన్ని ప్రేమిస్తున్నాను.

ఒక చెంపకొడితే మరో చెంప చూపటం
ఒక చెప్పుతో కొడితే మరో చెప్పు ఇవ్వటం
ఒక కాలితో తంతే మరోకాలికోసం ఆగటం
ఒక మోసం అర్థమైనా మరో మోసంకోసం ఎదురు చూడటం
అంటే, నా దేశాన్ని ప్రేమిస్తున్నాను.

ఇన్ని భాషాభూషణాలను అలంకరించుకొన్న
అక్కాచెల్లెళ్ళను
ఇన్ని రాష్ట్రాల రంగుల హోళీలోని అన్నదమ్ముల్ని
ఇన్ని మతాల మత్తుమందులు సేవించే అమ్మానాన్నల్ని

ఇన్ని కులాల కలకలాల కలహాల చుట్టకాల్చే తాత
ముత్తాతలను
కన్న నా దేశాన్ని ప్రేమిస్తున్నాను.

నా జాతి పీల్చి విడిచిన గాలినే పీల్చాను
వళ్లు మెదడు చిందించిన చెమట పెట్టిన కూడే తిన్నాను
బాటసారులకు పాంథశాలను ప్రపాశాలను, పక్షులకు
చెట్టునూ, అయ్యాను
పిడికెడు మట్టి అప్పుతో పుట్టి బండెడు మట్టి
వడ్డీతో తీర్చి వెళ్లాను
నా దేశాన్ని ప్రేమిస్తున్నాను.
ముళ్లు ఏరటానికి పుళ్ళు కడగటానికి
నీడ కాపటానికి ఇవ్వటానికి
చెదలు దులపటానికి చీడ పోగొట్టటానికి
బతుకంతా కళ్ళలో ఒత్తులు పెట్టుకొన్నాను
నా దేశాన్ని ప్రేమిస్తున్నాను.

మనిషి నా గీత బైబిల్ ఖురాన్
మనిషి నా బేంక్ చెక్‌బుక్ ధనం మానం
మనిషి నా ఊపిరి ప్రాణం రక్తం
మనషి నా చైతన్యం నా జీవితం నా వ్యక్తిత్వం
నా దేశాన్ని ప్రేమిస్తున్నాను.

ఊరి వెలుపలి పల్లెని, లేని రాకపోకల్ని చూచి
భరతపుత్రుణ్ణని భక్తితో పలకటానికి
అవమానం కలిగి అనుమానం వచ్చి;
దేశమంటే మట్టికాదని మనుషులనీ
పుట్టి పెరిగి గిట్టి మట్టికావటం తెలిసీ
దేశమంటే మనుషులుకారనీ మట్టనీ విని;
గుండెలో కర్ణుడికి తగిలిన బాణం గుచ్చుకొని

ఏకలవ్యుడి బొటనవేలులింగానికి పూజచేసి
విభీషణుణ్ణి లక్ష్మణుణ్ణిగా భావించుకొని
పచ్చిమండే నిరంతర శల్యంతో జీవిస్తున్నాను
ఈ దేశాన్ని ప్రేమిస్తున్నాను.

నే నొక్కణ్ణా ! నాతో ఈ దేశంలో కోట్లు !
నే నిక్కణ్ణా ! నా యీ దేశంలో ఎక్కడెక్కణ్ణో !
ఈ ప్రేమ సూర్యుళ్ళా చంద్రుళ్ళా గాలిలా
మనుష్యుల్లా మానవత్వంలా మమతా మాధుర్యంలా
నా దేశాన్ని ప్రేమిస్తున్నాను.

ఇంత ప్రేమకు పురుడు పోసుకొన్న నా తల్లి
హిమాలయం మహిమాలయం విశ్వాలయం
ఇంత ప్రేమను అందరికీ సమంగా పంచే నా తల్లి
అరేబియా బంగాళా హిందూ మహాసముద్రం
నిలువునా నెలువెల్లా నిలువెత్తున
నా దేశాన్ని ప్రేమిస్తున్నాను.
నా దేశం చిరంజీవి
నేను ప్రేమిస్తున్నాను.

# గుండెకాయ పోగొట్టుకొన్నాను

గులాబీ టొమాటోలవంటి
గుప్పెడు గుండెకాయను పోగొట్టుకొన్నాను.
జ్ఞాపకారణ్యం ఎంత వెతికినా
దాని ఆచూకీ తెలియటం లేదు.

పెళ్ళాన్నీ పిల్లల్నీ అడిగాను.
దిగులుగా తెలియదన్నారు.
వీళ్ళలాగే అది నన్ను నమ్ముకొంది.
ఎక్కడపడిందో దొరక్కుండా వుంది.

గుండెకాయలేక పోయినా
నాకు ఊపిరి ఆడుతూ
లోకం నడక సాగుతూ
పెట్రోలు నాగరికత పెరుగుతూ వుంది.

సుమతీ శతకంలో
నెమిలీకలా దాబానో
ఎక్కాల పుస్తకంలో
రంగుల పట్టుదారం ముక్కలా ఉంచానో
బడికి పోతూ వస్తూ రైలుకట్టరాళ్ళలో
బలపంలా పోగొట్టుకొన్నానో

ఎండిన చెట్టు మీంచి
ఏటవాలుగా శూన్యంలోకి పోయే పక్షిలా
పగిలిన బాడవపొలం నెర్రెల్లోకి
పరారయ్యే తొండలా

నాగరక జీవితధ్వని చేలంలోని
నిశ్శబ్దపు చిరుగుల్లోంచి పోయుంటుంది.

గుండెను కుంకుమగా అమ్మనుదుట పెట్టలేక
ఆమె గాజూ పూసతో పోగొట్టుకొన్నానో
వేలం వేసిన ఇంటిలో అన్ని వస్తువులతో
గుండెను కూడా వదిలేసి వచ్చానో
వర్తమానం లాల్చీ తొడుక్కొంటూ
గతం చొక్కాతో వదిలేశానో
భవిష్యత్తు ధోవతి ఇస్త్రీ చేసుకొంటూ కాల్చుకొన్నానో
స్మృతిటార్చితో అనుభవాల చీకటి గది వెతికితే
నోటినిండ విషాద సంగీతం.

ఆశయాల సూర్యుడి ఎండదెబ్బలు
తుడుచుకొన్న ఆశల హేండ్‌కర్చీఫ్
ఆనందపు వెన్నెల మంటలార్పే
ఫైరింజన్‌ల ప్రేమమనీపర్సు
నోవేకెన్సీ బుల్లెట్ మార్కులు
బ్రతుకు వెయిటింగ్ హాలులో ప్లాస్టిక్ కార్పెట్
అహోరాత్రులు అరిచిచచ్చిన అయ్యవారి నోరు
అహంకారం అర అర్హతపౌర వెతికాను

బస్‌స్టాప్ దుమ్ములో దొర్లుతూవుందో,
రైల్వేస్టేషన్ డస్ట్‌బిన్‌లో కూరుకుపోయిందో,
కాలేజీ ప్లేగ్రౌండ్‌లో పరుగెడుతూవుందో,
లైబ్రరీ దుమ్ము పుస్తకాలవెనక ఇరుక్కుపోయిందో
డిగ్రీకోసం నిద్రపోని నోట్‌బుక్స్‌కట్టల్లో పడిందో
గాలికిదొర్లి, ఎండి, తడిసి, వణికి
వీధిలో కేకపెడుతూవుందో

మహాకవి కావ్యంలోంచి చినిగిన కాగితంలా
మహాగాయకుడి గొంతులోంచి రాలిపడ్డ రాగంలా
చివికిందో, చితికిందో, ఛిద్రుపలయిందో-
రోడ్డు హోటలు సినీమా జనం కాళ్ళకింద పడిందో
ఎక్కడుందో, ఏమయిందో, ఎలావుందో—
మనిషి తిరిగే చోట పడివుంటుంది
వచ్చే పోయే ప్రతి మనిషినీ అడుగుతూవుంటుంది.
గుండెభాష అర్థమయివుంటే నాకిచ్చేయండి.

మీరు తొక్కితే పగిలే, తన్నితే దొర్లే, దాన్ని
నేను చూళ్ళేను, అది లేకుండా ఉండలేను.
నేను పోయినా మిగిలేది నా గుండెకాయ.

మురుక్కాలవలోకి కంకర్రాయిలా తన్నొద్దు
అల్మరాలోకి పాత ఉత్తరంలా పారెయ్యొద్దు
చెత్తకుండిలోకి చిత్తుకాగితంలా కుక్కెయ్యొద్దు.
దౌర్భాగ్యుడు పారేసుకొన్న గుండె అని లేబిల్ అంటించి
రంగుటద్దాల ఎగ్జిబిషన్ కేజ్‌లో పెట్టొద్దు.
అది చిలకకాదు, పంజరంలో పలకలేదు.
బ్రతుకు పరుగు పందెంలో ఉన్నవాణ్ణి
ఒకే ఒక్క ఆస్తి గుండెకాయ పోగొట్టుకొన్నవాణ్ణి.

నా కోసం నా గుండెకాయ
ఎన్ని గడపలు ఎక్కి దిగిందో,
ఎన్ని భాషలు నేర్చిందో,
ఎంత సృష్టి చేసిందో.

వేసవి ఉదయపు చలిగాలి మొలకలా
తొలకరి వానచినుకులా
అమ్మ చూపులోని అమృతంలా
నా గుండె నా కోసం వస్తుంది

నా కోసం నా గుండెకాయ
వ్యాసుళ్ళా తపస్సు చేస్తూ వుంది
పంచమవేదం ప్రభవిస్తుంది
మహాత్ముళ్ళా ఆగ్రహిస్తూవుంది
మానవత్వం ప్రతిష్ఠిస్తుంది.

నేను నడిచివచ్చిన రోడ్లన్నీ దాటుకొంటూ
పుట్టించోటికి పోయేలోగా
నా గుండెను చేరుకొంటాను.

అనుభవాల తెరలు తీసి జ్ఞాపకాల తలుపులు తెరిచి
గతంలోకి ప్రయాణం చేసి
నా గుండెను కలుసుకొంటాను.

అది నాలో నాతో నాకై ఉన్నక్షణంలో
నేను స్రష్టను, సృష్టిని, సమస్త విశ్వాన్ని
భవితవ్యానికి కళాఖండాన్ని, రసక్షేత్రాన్ని.

నాకు తెలుసు
ఒకనాటికి నేను నా గుండెను కలుస్తాను
లోకానికి మిగులుతాను.